# గిరిజాపరిణయము

విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి





# గిరిజాపరిణయము

విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి





# గిరిజాపరిణయము.

పాలకొండ బోర్డుహైస్కూలు ప్రధానాంధ్ర పండితులగు

విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి

గారిచే రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

విశాఖపట్టణ,

గుప్తాబ్రదర్సు

వారిచే ప్రచురింపబడినది



విజయ రామచంద్ర ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

1927.



[ వెల రు 0-8-0.

# తొలిపలుకు.



బ్రహ్మశ్రీ విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి గారిచే రచియింపఁబడిన "గిరిజాపరిణయము" అను వచనగ్రంథమునందలి కథాంశము శ్రీనాథకవి విరచితంబగు "హరవిలాసము" నుండి సంగ్రహింపఁబడినది. ఈ వచనగ్రంథమునందు మాతృకనుండి కొన్నిగద్యపద్యములు సందర్భానుసారముగనెత్తివ్రాయఁబడుటచే గ్రంథకర్త సాధ్యమైనంతవఱకు తన శైలిని వన్నెకెక్కిన శ్రీనాథమహాకవి శైలితోఁ దులదూఁగునట్లు వ్రాయయత్నించెను. నేఁ డాంధ్రపాఠకమహాలోకమునకు నవల లెట్టి హర్షోత్కర్షమును గలిగించుచున్నవో యట్టి యామోదము నీగ్రంథము కలుఁగఁజేయఁగలదని నానమ్మకము.

గ్రంథకర్త యనేకవత్సరములనుండి యున్నతపాఠశాలలయందుఁ బ్రధానపండితులుగఁ బనిచేయుచు బాలుర కుపయుక్తమగు పఠనీయగ్రంథముల శైలి యెట్లుండవలయునో బాగుగ గుర్తించినవారగుటచే- కథనంతటిని మృదుమధురశైలిని వ్రాయఁ గలిగెను. పదలాలిత్యము, వివిధవర్ణనలు సమాసములపొందికయుఁ బాఠకులహృదయముల నాకర్షించును.

ఈగ్రంథము న్నున్నతపాఠశాలలయందలి యయిదారు ఫారముల కప్రధానవచనముగాఁ గాని నాలవఫారమునకుఁ

ప్రధానవచనముగాఁ గాని యుపయోగింపవచ్చునని నా యా శయము.

గ్రంథకర్త వయసునఁ జిన్నయయ్యుఁ దనవచనగ్రంథము చే నాంధ్రలోకమున కచిరకాలంబునఁ గృతపరిచయుండు కాఁ గలఁడని నానమ్మకము. ఉన్నతపాఠశాలల ప్రధానోపాధ్యా యు లీగ్రంథమును దమ పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగ వాడుక చేసియు, నాంధ్రభాషాపోషకులును, పండితులును దీనిని సాదరభావముతోఁ జదివి లోపంబులు గలవేని రెండవ కూర్పునందు సవరించుకొనుటకై గ్రంథకర్త కెఱింగించియు, వారిని బ్రోత్సహింతురుగాత—

బోర్డు హైస్కూల్.
పాలకొండ.

ఇట్లు,
(Sd.) ర్యాలి వెంకటభోగారావు,
బియే, యల్. టి.
హెడ్మాష్టర్.
19-3-27.



# విజ్ఞాపనము.

నే నీచిన్నపొత్తమును నామిత్రులప్రోత్సాహమున నున్నతపాఠశాలలలో నాలుగైదాఱుఫారములఁ జదువుబాలుర కుపయోగించునటుల రచించితి; దీనిని శ్రీనాథుని హరవిలాసము నాధారముగఁ జేసికొని రచించినాఁడను. మఱియు సందర్భోచితముగ నిందు హరవిలాసములోని కొన్ని పద్యములను గద్యలనుగూడఁ బొందుపఱచితి.

ప్రథమప్రయత్నం బగుటచే నిందుఁ గొఱఁత లుండవచ్చును. విద్వజ్జను లాతప్పులను మన్నించి నాయెడసోదరభావముం జూపుచుఁ దెలియఁజేసిన రెండవముద్రణమున సవరించుకొనువాఁడను. దీనికి శ్రమయనక తమ యుదారాభిప్రాయముల నొసఁగిన పండితోత్తములకు నామనఃపూర్వకాభివందనముల నర్పించుచున్నాను.

నా యీయుద్యమమునకుఁ దోడ్పడి తగు ప్రోత్సాహముం జేయ విద్యాశాఖాధికారులం బ్రార్థించుచున్నాను.

న న్నీయుద్యమమునకుఁ బురికొల్పి యథాశక్తి తోడ్పడిన పరోపకారధురీణులును, బట్టభద్రులును, ప్రధానోపాధ్యాయులును నగు శ్రీ ర్యాలి వెంకటజోగారావుపంతులు గారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడనై యుండువాఁడ.

పాలకొండ,
17-3-27.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,
విద్వాన్. వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి,
ఆంధ్రప్రధానోపాధ్యాయుఁడు,
బోర్డు హైస్కూల్, పాలకొండ.

# పండితాభిప్రాయము.



బ్రహ్మశ్రీ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రిగారు తాము రచించిన "గిరిజాపరిణయము, గుణనిధి, తిన్నఁడు" అను మూఁడు వచనకావ్యములను అచ్చుటచ్చుటఁ జదివి నాకు వినిపించిరి. శాస్త్రిగారెంచుకొన్న యీదలి యితివృత్తము సుప్రసిద్ధ గ్రంథములలోనిది. బడిలోఁ జదువుబాలురకు మిక్కిలి నీతిబోధకము. ఈశ్వరభక్త్యుద్బోధకము నై యున్నది. శైలి యన్ననో మృదుమధురముగాను, స్పష్టముగాను నున్నది. ఇప్పుడు నూతనముగ వెలువడుచున్న వచనకావ్యములకును నీ గ్రంథమునకు నధికవైలక్షణ్యము గలదు. నాలుగైదాఱు ఫారములఁ జదువుబాలురకీగ్రంథములు చదువఁదగిన పాఠపుస్తకములు.

విజయనగరము,
12-1-27.

(Sd.) మేడేపల్లి వేంకటరమణాచార్యులు,
విజయనగరము మహారాజావారి యాంగ్ల కళాశాలలో సంస్కృతాంధ్రోపాధ్యాయుఁడు.



# OPINIONS.

MAHARAJAH'S COLLEGE,
Vizianagram,
12-2-27.

I have gone through portions of the three Telugu books–Girija Parinavam, Thinnadu and Gunanidhi written by M. R. Ry. V. L. Narasimha Sastry Garu of Board High School, Palakonda. They are all in chaste classical style. The narrative is of a dignified charecter. They are fit for being used in High School Forms in the Telugu Districts They are a very good introduction to the valuable works of Srinadha and Dhurjati. The books deserve wide circulation especially among the students in the higher classes. I trust that they will be printed and published at an early date.

(Sd) M. VENKATARANGAYYA,
Chief Lecturer in History,

---

I have read with much pleasure certain portions from గిరిజాపరిణయము, గుణనిధి, తిన్నడు prose works written by Vidwan Vadlamani Lakshmi Narasimha Sastry Garu. All the three books were written in elegant and chaste style. The author, being a Pandit having work with High School forms has

carefully adapted a style which is quite suitable for the boys in the Higher forms. Hence they do quite well to be as text books in forms IV and V.

Vizianagram,
15th January 1927.

(Sd.) A. RAMARAO,
Senior Telugu Pandit,
Maharajah's College.

---

## ANDHRA RESEARCH UNIVERSITY (Inc),

VIZIANAGRAM CITY, (S INDIA.)

*Chancellor,*

His Highness the Maharajah Saheb Bahadur of Vizianagram Raj.

*President,*

Chevalier-Baron of Aran. B. Seshagiri Rao, M A., (Madras) Ph. D., (Wies). M. S. A. (Paris)

Brahma Sri Vidwan Vadlamani Lakshmi Narasimha Sastry Garu has read out to me portions of his prose books— గిరిజాపరిణయము, గుణనిధి, తిన్నడు based on Puranic Poetic Literature. They are composed in a clear, flowing, chaste and dignified style and are in my openion fit to be prescribed as reading books for the upper forms in Secondary Schools.

(Sd) B. SESHAGIRI RAO,
1-2-1927.





శ్రీరామాయనమః.

# గిరిజాపరిణయము



## మొదటిప్రకరణము.



### తారకునితపము.

తారకుం డసురకర్కశుం డను వంశపారంపర్యముగ వచ్చు దౌష్ట్యమును విడ నేరక కఠినుండును దుష్టుండై సంచరించుచు నింకను నజేయత్వమును సంపాదింప నెంచి సకలమును విడి ఘోరకాంతారములఁ బ్రవేశించి యట వాణీనాథునిఁ గూర్చి నియతనిష్ఠుండై ఘోరతపం బాచరించుచుండె. దానిం గని యింద్రుండును నిజపదవి నాకాంక్షించి తప మాచరించుచున్న దలంచి తత్తపోవిఘ్నము నాచరింప స్వపరివారమును దార కాశ్రమమునకుఁ బంపెను. తారకుండును బ్రహ్మాదర్శనదోదూయమానమానసుండై యింద్రునిపరివారమువలన సంభ

వించు నంతరాయముల కెడ మీయక తదేకనిష్ఠాగరిష్ఠుఁడై తపం బాచరించుచుండె. ఇంద్రుఁడు తనయత్నంబులు విఫలంబు లగుటయును దారకునితపము వృద్ధిచెందుటయును గాంచి మిగుల వగలం బొగులుచుండెను. తారకుఁడును దినంబులు గడచుచుండఁ గందమూలాశనుండును బర్ణభక్షణుండును జలపానాభిరతుఁడును వాయుభక్షణుఁడును నిరాహారుండును నై తపంబును జేయుచు నెప్పటికిని వాణీనాథుఁడు మెచ్చి తనయీప్సితమును నెఱవేర్పమిఁ గినుకఁ జెంది బ్రహ్మార్పణంబుగ నిజశరీరఖండంబుల హోమముఁ గావించుచుండె. అంత నాయగ్నిశిఖలు తారకుఁడు ముందు మిమ్ము బాధించి నాకపురంబును దహింపఁగలాఁ డని చెప్పఁబోవు వార్తాహరులమాడ్కి నాకపురంబునకు వ్యాపింపఁజొచ్చినవి. దానిం గని నాకపురవాసు లందఱును దేవేంద్రునిఁ దఱియంజొచ్చి "దేవా! తారకుం డనురాక్షసోత్తముండు ఘోరంబుగఁ దప మాచరించి తన్ను బ్రహ్మ మెచ్చమిం జేసి స్వశరీరంబును దఱిగి హోమముఁ గావించుచుండ నాయగ్నిశిఖలు మనపురమం దెల్లయెడలఁ దామ్రమై నానాముఖములఁ బర్వఁజొచ్చినవి. మన మిదివఱకుఁ జేసినయత్నంబు లెల్ల విఫలంబు లయినవి. మన మిఁక నుపేక్షించిన నాతఁ డీప్సితంబును బడసి మనల మననీఁడు. కాన దీనికిఁ గర్తవ్యమును యోచించినఁగాని లాభము లే"దని మోముల దైన్యరసము దోఁపఁ బలికిరి. తోడనే

యులికిపడి లేచి యింద్రుడు తానును దారకుని తపశ్చరణ మునకై విచారించువాఁడగుట నిజపరివారము తన్ననుసరింప నున్మత్తుచిచందాన వాణీనాథుని సందర్శించి తారకునితప శ్చరణప్రకారమును దుదముట్ట విన్నవించి తమ్ము వానిబా రినుండి తప్పింపు మని మొఱపెట్టెను. నలువ భీతచిత్తుఁడై యొడ లెఱుఁగక మొఱలిడు శచీనాథునిఁ గాంచి యూఁదరించి "యింద్రా! తారకునియీప్సితమును నే నెఱుంగుదు. నీవు దీనికై వగవం బనిలేదు. నే నిప్పుడ పోయి వానికోర్కెం దీర్తును. నీ వింక భయంబును వీడి సపరివారముగఁ బురిం జేరుము" అని యోదార్చి యనిపి తాను దారకాశ్రమమునకుఁ బోయె. ఇంద్రుడును ముదం బంది స్వపురిం జేరి సుఖంబుల నందుచుండె.

—: వ ర దా న ము :—

నలుమోముల వేలుపు తారకుని యాశ్రమమునకు వచ్చుసరికిఁ దారకుఁడు శరీరఖండంబుల హోమముఁ గావించి నిజశిరమునుగూడఁ దఱుగ నుద్యుక్తుఁడై యుండెను. దానిం గని బ్రహ్మ "వత్సా! తారకా! ఆఁగుము. త్వరపడకుము. నీతపంబునకు నే నెంతయు సంతసించితి. నీమనోరథముఁ దెల్పిన నీడేర్చువాఁడ" ననుచు మ్రోల నిలువం గని కంటకితదేహుండును, గద్గదితకంఠుండును, ఫాలన్యస్తాంజలియు నై యా

తని శక్తిమీఱ నుపనిషద్వాక్యంబుల నుతించి "దేవా! భవద్దర్శనము నభిలషించి యీకాననఁ జిరకాలమునుండి కాయలే తినుచు నారలే కట్టుచు శీతాతపవర్షంబుల కోర్చి యిట్లున్నవాఁడ. నేఁటికి నాతపఃఫలము పండినది. నాజన్మమును గృతికృత్యత నందినది. నాకిఁక వేఱొండుకోరికయు లేదు. అయినను వరం బీఁదలఁతేని నా కీముల్లోకముల నజేయత్వమును బ్రసాదింపుము. ఇంత కెక్కుడువరము నా కక్కఱలేదు." అని కోరినఁ బద్మసంభవుఁ డాతనిభక్తికి మెచ్చి "తారకా! నీకోరిన యజేయత్వమును గటాక్షించినాఁడ. నీ విఁక గర్వింపక ధర్మపరుఁడవై స్వజాతిసామాన్య మగుదౌష్ట్యమును వీడి సుఖంబుండుము. పొమ్ము. నీ వొకవేళ వరలబ్ధగర్వితుఁడవై లోకంబుల బీడించితివేని హరతేజస్సంభూతుండు కుమారుండు నిన్ను సంహరించును జుమా! ధర్మపరుఁడవైన నాహరుఁడైనను నిన్నుఁ గన్నెత్తిచూడనోపఁడు. ఇది నిజము. నానుడుల విశ్వసింపుము. పొమ్ము. సుఖంబుండుము." అని యానతిచ్చి స్వలోకంబునకుఁ బోయె. తారకుండును నలువ తన్ను వీడి పోయినతోడనే నిజనివాసంబున కేగి సుఖంబుండె. పాప మింద్రాదులు నలువ యొసంగిన యభయంబున నిర్విచారులై యథాపూర్వము తమతమ హవిర్భాగంబులఁ జేకొనుచు స్వఃపురి సకలసుఖంబుల నవ్యారిగ నందుచు నిజహృదయంబులఁ జేయి పెట్టుకొని నిద్రించుచుండిరి.

## —: తా ర కు ని దౌ ష్ట్య ము :—

తారకుఁడు బ్రహ్మవరలబ్ధగర్వితుఁడై త్రిలోకముల నేలుచు ముప్పదిమూఁడుకోట్లదేవతలను మహర్షులను బీడించుచుఁ బ్రతాపగుణంబునఁ దానయై చెలరేఁగుచుండెను. దేవత లందందుఁ బరువులిడిపోయినను వారలఁ దోకొనివచ్చి వారు సూచుచుండ వియన్నదీజలంబుల దూషితంబులఁ జేయుచు నందలి బిసనాళజాలంబులఁ బెఱుకుచు వాయుమార్తాండులఁ దనచేతి కీలుబొమ్మల వలె నాడించుచుండె. మఱియుఁ దనకుఁ గాసరాక్షతామ్రాక్షధూమ్రాక్షాదిబంధుజాలంబు సహాయమై యుండఁ దన్నె డిక్కుగ నెంచి యాశ్రయించి యుండిన దౌష్ట్యమును వృద్ధిపఱుప నెంచియు లోకకంటకబిరుదమును సముపార్జింప నెంచియు నైంద్రిమాసురయాగ్నేయ నైలబిలము మున్నుగాఁ గలయష్టదిశలఁ దాన కైకొని యింద్రాదుల సరకుగొనక యేకాతపత్రంబుగ ముల్లోకంబుల నేలుచుండె. దేవతలు మనుష్యలోకంబులఁ జేయు యాగంబుల హవిర్భాగంబులఁ జేకొన నొల్లక నిత్యోపవాసంబులఁ గుందుచుండిరి. మనుజులుకూడఁ దారకునికి వెఱచి యాగంబులఁ జేయ మానిరి. మునులుగూడ నీదుష్టునిచెయ్వుల కెంతయు భీతిల్లి తపంబుల మాని నిగూఢవర్తనులై కానలఁ దిరుగాడుచుండిరి. ఇంకను గిన్నరకింపురుషయక్షగరుడసిద్ధసాధ్యా

ములు తారకుని నామమాత్రశ్రవణంబున నేమియుఁ జేయఁ జాలక స్వవిమానంబుల నొకమూలఁ బాఱవైచి ప్రాణరక్షణ తత్పరులై యుండిరి. ఇంద్రాదిసుర లీవఱ కెన్నఁడును భీఁత యనునది యేమో యెఱుఁగక యుండియు నిప్పు డీతారకుని మాయలఁ జీకాకుఁ జెందియు విసిగియు వేసరియు సిగ్గువడియు నలసియు నంగ లార్చియుఁ గులకులఁ గూసియు దిక్కుఁ గాన నేరక యుపాయాంతరశూన్యులై యందఱు నొక్కుమ్మడి బయలువెడలి పద్మజు సందర్శించి పేరెలుంగున నాతని యా స్థానపీఠికపైఁ బడి యావఱచినచందానఁ గుయ్యో మొఱ్ఱో యనుచును రక్షింపు మనుచును నెత్తి నోరు కొట్టుకొని విల పించుచుండిరి.

—: బ్రహ్మ దేవతల నోదార్చుట :—

ఇంద్రాదులు విరించిని బలువితంబులఁ బొగడి తమ బాధల మాన్పు మనియు గర్భదరిద్రుల మైతిమనియుఁ గుక్క లుగూడఁ బడనిపాట్లు బడితి మనియు నిఁక నీరీతి బాధలఁ బడఁ జాల మనియుఁ దారకవధోపాయం బెఱిఁగింపు మనియు దీనాతిదీనులై వేఁడుకొనఁజొచ్చిరి. అంత వాణీనాథుఁడు "దేవవరులారా ! మీరు వగవకుఁడు. తొల్లి యీతారకుఁడు ఘోరతపముం జేసి నావలన నజేయత్వముఁను బొందెను. 'వి షవృక్షోపి సంవర్ధ్యస్వయం ఛేత్తుమసాంప్రతమ్" అను నా

రోక్తి మీ యెఱుంగనది కాదు గదా ? దానంజేసి వరప్రదా తనగు నేను దారకుని వధింపఁజాలను. మఱియు నావరదానం బునం జేసియే యింతవాఁ డయ్యె. నే నలనాఁడు "నీ వధర్మ పరుఁడవై తేని శివ తేజస్సంభూతుండు కుమారుండు నిను సం హరించు" ననుచు వానికిఁ జెప్పితిని. అందున మీరిపుడు మ నంబులఁ గినుకఁ జెందక యామాహరుని సమీపింపుఁడు. మీ కా తనివలన సర్వశుభంబులును జేకూరఁ గలవు. హరునిఁగా కన్యలఁ జేపట్టిన మీ కార్యము నెఱవేఱఁ జాలదు. శీఘ్రింబ నానుడిఁ జేకొని పొండు. నన్ను మీ రెంత మోమోట పెట్టి నను లాభము లేదు. నే నొసఁగిన వరంబుల మఱలఁ జేకొనఁ జాలను. ఇఁక మీమీవిచారంబులఁ గట్టిపెట్టి శివు నాశ్రయిం పుఁడు. మఱియొకమాట నాలింపుఁడు. పార్వతీపరమేశ్వరుల కు దయించిన నందనుండు తారకుని సంహరించు. ఆతఁడే మీకు సేనాని యగు. దక్షకన్య జనకకృతావమానయై దేహత్యాగ ముఁ జేసికొని మఱల హిమవద్గృహమునఁ బుట్టి పెరుఁగుచున్న యది. మీరిఁక నొఁ గా దనక యాయుమానీలకంఠులఁ గూ ర్పుఁడు. ఇది మొదలు సుఖం బుండఁగలరు. పొండు." అని యానతిచ్చి స్వవ్యాపారంబునం బ్రవర్తించుచుండె. ఇంద్రా దులుచు దమకు శుభనిమిత్తంబులు దోఁచుచు నిజనివాసంబు లకుఁ బోయి కార్యసాధనపరత నుండిరి.

## —: పార్వతీ జననము:—

అటమున్న యఖిలజననియు నాదిశక్తియుఁ బురారి యర్ధాంగలక్ష్మియు నగుదక్షకన్య జనకకృతావమానాసహయై యోగాగ్నిని దేహత్యాగముఁ గావించుకొని మఱుసటిజన్మంబున నయోనిజ యగుచు నోషధీనిలయంబును మేరుమంధర వింధ్యాదిసుప్రథితగిరిసంబంధబాంధవంబును నగు నీహారాద్రినాథునకును బితృదేవతలకుఁ గన్నబిడ్డ యయిన మేనకకును మైనాకసోదరియై పార్వతీనామంబున జనియించె. ఆదేవి య ట్లుదయంబైనతోడనే దివ్యులు సుమవర్షంబుఁ గురియించిరి. మేనకయుఁ దనకు దివ్యలక్షణలక్షిత యగుసుత యుదయించుటం జేసి యధికానందంబున నోలలాడుచుండె.

"వ. అనంతరంబ ప్రతిదినవర్ధమానయై లబ్ధోదయ యగుచంద్రరేఖయుం బోలె బంధుజనంబులకుఁ బ్రమోదంబు నందించుచు మందాకినీసైకతవేదికాస్థలంబులఁ గందుకక్రీడ సల్పుచు నుపదేశకాలంబుల విద్యలు నేర్చుచు బాల్యంబుఁ గడపి నేత్రోన్మీలనంబు సేసిన చిత్రంబునఁబోలె యౌవన విభక్తంబై యభ్యుదయంబై యభ్యున్నతాంగుష్ఠనఖప్రభావిక్షేపంబున రాగంబు వెడలఁగ్రక్కునవియుంబోసి చరణప్రవాళంబులును వృత్తానుపూర్వంబులై యనతిదీర్ఘంబులగు "జంఘాప్రకాండంబులును వేదండశుండాదండంబులకు వైదండికం

బులై యొప్పారు నూరువులును నభినవశిరీషకుసుమసుకుమారంబులగు బాహువులును ధర్మబంధురంబగుకంధరంబును సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబుడంబు విడంబింపఁజూచు నాననంబును గావియగు మోవియును నూఁబూవువంటి నాసికయు నిద్దంపుటద్దమ్ములకుఁ దోడిముద్దులగు ముద్దుచెక్కులును సముకోదండవల్లీమతల్లులగు కటివంకబొమలును విదియ చందురునకుం జుట్టంబగు లలాటపట్టంబును గొదమతుమ్మెదచాలుం బురుడించు పంజాలు లీలాలకంబులును నొప్ప సర్వోపమాద్రవ్యసముచ్చయంబగు సౌందర్యంబు నేకత్రావస్థానదిదృక్షచే విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశనివేశితంబుగ నొనర్చెనో యనం దల్లి దండ్రులకు నామోదంబు నాపాదించుచుండె."

—: ఓషధీప్రస్థపురసభకు నారదుఁడు విచ్చేయుట :—

అంత సుతజననంబునం జేసి ముదంబందుచుఁ దగుపరివారంబు తన్ను సేవించుచుండ నిజసభాభవనంబున నాసీనుఁడైయుండిన హిమనగాధీశ్వరునిఁ జూచువేడుక నారదముని యేతెంచె. తోడనే యనుచరులు నారదాగమనమును విన్నవింప హిమవంతుండు ససంభ్రమహృదయుండై యెదురేగి యుచితవిధి నాతిథ్యాదిసత్కారంబుల సురముని నాదరించి యుచితాసనాసీనుం గావించె. మునియు హృష్టచేతస్కుం

డై హిమవంతుని గుశలపశ్నపూర్వకంబుగ దీవించి యాతని యంకపీఠి నలంకరించి యున్నపార్వతిం జూచి రాజా !

సీ. ఈనీరజాతాక్షి । మేనిలో సగపాలు
గణుతింప మగపాలు । గాఁగనున్న
దీపల్లవాధరి । శ్రీపాదపద్మంబు
నోరయు నొక్కొక్కమాఱుడుగణేశుఁ
డీకాంతతోడ మం। దాకినీ వాహిని
సవతిగా గలదేమి । చందమునను
నీలతాతన్వికి । నీరేడులోకంబు
లభిరామ కేళిహా।ర్మ్యంబు లగును
నిండు వేడుకఁగాంచు నీ।నీలవేణి
కొమ్ము లేనుంగు మొగమైన । కొడుకుఁగుఱ్ఱ
నత్తయును మామయును లేని । రిత్తయింట
మనువుమని పెడు నీయింతి । మగనితోడ.

ఉ. మాటలు వేయు నేమిటికి । మంగళలక్షణ లక్ష్మియైన యీ
జోటికి భర్తకాఁగలఁడు । సోమకిరీటుఁడు సర్వదేవతా
కోటికిరీటకోటిపరి । కుంచితదివ్యమణిద్యుతిచ్ఛటా
పాటలపాదపీఠుఁ డగు । పట్టికృతార్ధుఁడ వైతిభూధరా!

యనుచుఁ జెప్పి హిమవంతుని వీడ్కొని చనియె. అది దొరంకొని హిమవంతుండు దూరీకృతాన్యవరాభిలాషియై

నిజసుతను నాగభూషణున కీఁదలంచియు మాట వోవునను భయంబునఁ దన్ను యాచింపరాని శివునకుఁ గన్య నెట్లొసంగు వాఁడననుచును నాతని కారుణ్యము నాపై నెప్పుడువచ్చునో యనుచును దలంచుచు నీశ్వరాభిముఖ్యమునకై వేచియుండె ను. అగజ సురమునివాక్యముల నాలించినది మొదలు ద్విగుణీకృతేశ్వరకరగ్రహణోత్సుకయై దినంబులఁ గడుపుచుఁ దండ్రిని జేరి యీశ్వరపరిభావంబును దేటతెల్లముగఁ జెప్పుచుండె. గిరిరాజు నిజసుత మనోభావమును సురమునివాక్యములను గని వినినవాఁడగుట తుష్టుండై నిజాభిప్రాయమును దన పరివారమునకును, నిజప్రాణనాయిక యగు మేనకకును వెల్లడించుచుండె. పార్వతి యనుదినంబును నీలకంఠునే ధ్యానించుచు నాతనినామంబుల గణుతించుచు నాతనిసేవనే యెద నభిలషించుచుఁ గార్యాంతరవిహీనయై యుండె.

—: ఈశ్వరుని దారుకాశ్రమప్రవేశము :—

అంత నీశ్వరుఁడు దక్షకృతావమానయై దాక్షాయణి శరీరత్యాగంబు గావించినది మొదలు సర్వసంగపరిత్యాగియు, దూరీకృతాన్యకళత్రాభిలాషియునై ప్రమథవర్గంబును బసవఁడును దన్ను సేవించుచుండ హిమశైలపాదంబునందు నియతిఁ దప మాచరింప నుత్సహించి యందు విడిసె. ప్రమథగణము లెల్లను నీలకంఠుని వీడ నేరక హిమనగమున కేగి యందలి

చంద్రకాంతమణిస్థలముల నుండిన నమేరువృక్షచ్ఛాయల భూజ్జరపత్రింబులఁ దాల్చియుండిరి. బసవఁడును వారలంగలసి యథేచ్ఛ నందలిపైరును గడుపార మేసి సెలయేళ్ళజలంబుల నాపోవం ద్రావి అంకెవైచుచు మృగగణంబులు భీతిల్లునటులు దిరుగాడుచుండె. అంత దాక్షాయణీనాథుఁ డాప్రాంతము ననే యొకరమణీయతరాశ్రమముం గల్పించుకొని యందుఁ దప మాచరించుచు నొక్కనాఁడు హిమనగాధీశుని మనమున్నఁ దలఁచెను. తోడనే యానగాధిరాజు ముదితచేతస్కుఁడై యధికాదరము దోఁప సతీకళత్రునకు విధివిధానమున నర్ఘ్యాదివిధులఁ బూజసేసి నారదమునివాక్యంబులు తలఁపునకురా నిజసుతను రావించి యాసతీధవుని పరిచర్యఁ జేయ నజినంబు నొసంగి సమర్పించె. ఈశ్వరుఁడు హిమవత్సుత తనకుఁ బరిచారికగా నుండినఁ దపోభంగ మగుననుచు నెంచియు మోమోటమిచే నామెచేయు సేవ కంగీకరించి హిమవంతుని బ్రియపూర్వకంబుగ నాదరించి పంపివేసె. హిమవంతుఁడాసన్ని వేళమున కెంతయు మనంబున సంతసించి నిజసుతకు వివాహము సేయఁ బ్రయత్నింప నవసరము లేదనియుఁ బార్వతియే ఈశ్వరునిమెప్పువడసి యాతనిచెట్టవట్టుననియు మనంబున నెంచి సుతకు హితవుపదేశించి సపరివారుఁడై యోషధీపస్థమునకుఁ బోయె.

తండ్రి తన్నువీడిపోవ నగజ మునివేషమును బూని యొకతరువు నీడ నాశ్రయించి తప మాచరించుచు సమయానుకూలంబుగ నీశ్వరాశ్రమమునకుఁ బోయి వేదికాసమ్మార్జనముం జేసి రంగవల్లుల నలంకరించి పూవులను నర్ఘ్యోదకంబులను, దర్భలను గంధాక్షతంబులను, ధూపదీపాదికములను, సముపార్జించి యీశ్వరునిమ్రోలఁ బెట్టి యనుదినంబును నాతని నవ్యాజభక్తిమైఁ గొల్చుచుండె. శివుండును బార్వతీదత్త పూజాద్రవ్యంబులను నిర్వికారంబుగఁ జేకొనుచు నాతన్వి కావించు తపమునకును దనయెడ నామెచూపు భక్తికిని డెందంబున నానందించుచు నాదారుకాశ్రమమున బ్రమథవరులొకవంకను బసవఁడొకచాయను నగరాజసుత యింకొకవంకను భక్తిపూర్వకంబుగ సేవించుచుండ విచారమనునది లేక యింద్రియజేతయను నిజనామమును సార్థకముగఁ జేయుచు నిర్విఘ్నంబుగఁ దప మాచరించుచుండె. మఱియు నీశ్వర ప్రభావంబునం జేసి యాయాశ్రమంబునఁ గల పరస్పరవిరోధిజంతువులుగూడ నత్యంతమైత్రిని గలిగి యీశ్వరసేవాసమాసాదితహృదయంబులై యుండెడివి. గిరిరాజుగూడ న య్యాశ్రమంబునకు యాదృచ్ఛికముగ వచ్చుచుండెడివాఁడు.

# రెండవ ప్రకరణము.



## —: పురంధ్రీలలామల కలకలము. :—

కలహాశనమౌని వచ్చుటయు గిరిరాజు నిజసుత నీశ్వరునిపరిచర్య జేయ దారుకాశ్రమమున విడుటయు మున్నుగాఁగల సర్వవృత్తమును నోషధిప్రస్థపురలలామలు కర్ణాకర్ణికగ నాకర్ణించి మనఁబుల ముదంబందుచు నొకచో గుమిగూడి "యమ్మలారా! మన రాజసభకు నారదుండు విచ్చేసి మనపర్వతరాజతనయను గాంచి యామె శివుని యర్ధాంగలక్ష్మి యగుననియుఁ గంగాదేవి యామెకు సవతి యగుననియుఁ జెప్పినాఁడఁట. దానంజేసియే మనరాజు యుక్త వరాన్వేషణమును మానినాఁడను వారును, నిజమమ్మా! మొన్న మొన్న నాయీశ్వరుఁడు మన పర్వతసమీపమున నున్న దారుకాశ్రమమునఁ బ్రవేశించినాఁడఁట. దానిని విని మనరాజుగారు నిజసుతను జేకొని యీశ్వరునిసేవఁ జేయ వీడి వచ్చినారఁట యనువారును, అకటా! రాజభోగంబుల ననుభవించు మనయగజ యాశ్రమమున వల్కలాజినముల ధరించి కాయగసరులఁ దిని యెట్లుండనోపునమ్మా! యనువారును, గట్టిఁడులైన మేనకాగిరిరాజులు కానకకన్నసంతాన మని యైనఁ దలం

పక యాచిన్నికొమరిత నిట్లు వీడియుండ నెట్లు సాహసించిర
మ్మా! యనువాడును, కాదమ్మా! మనయగజ పూర్వజన్మం
బున దక్షసుత యగు సతియఁట. దక్షుఁడు బ్రహ్మసభం దన్ను
నీలకంఠుఁడు పరాభవించె ననునెపంబున నాతనిఁ బరాభవింప
నుత్సుకుఁడై యొకయాగమును జేసి యందుకు బ్రహ్మను నా
రాయణునిఁ గొందఱ దేవతలం బిలిచి యీశ్వరుని మానెనఁట.
దానిం దెలిసికొననేరక సతి స్త్రీచాపల్యంబున నిజధవుని స
మీపించి జనకుని యాగదర్శనమునకుఁ బోఁ సెలవీయఁ బ్రా
ర్థించె. శివుఁడు నిన్ను నీతండ్రి పిలువమింజేసి వెళ్ళవల దనియు
నీ వొకవేళ నీతండ్రియింటికిఁ బిలువకపోయినను వెళ్ళిన దోష
ముకాదని యెంచి వెళ్ళిన దప్పక పరాభవము జరుగుననియుఁ
జెప్పి యామెకు బోధింప యాగదిదృక్షు భర్తృనాజ్ఞ నుల్లం
ఘించి యామె పోవ నట నెవరును గన్నెత్తి యామెనుజూడ
నొల్లరైరి. ఆపరాభవమున కామెయెద నెంతయు విచారించి
యోగాగ్నిం గల్పించుకొని శరీరత్యాగముం జేసెనఁట. ఈశ్వ
రుఁడు దానిం గాంచి వీరభద్రావతారుఁడై దక్షాధ్వరధ్వంసము
గావించుచుండ బ్రహ్మము లాతనికోపము నుపసంహరించి
యెట్లటో మాయోపాయంబున దక్షాధ్వరముఁ బూర్తిగావిం
చి స్వభవనములకుఁ బోయిరఁట. నాఁడుమొదలు వివాహ
మును మాని యీశ్వరుఁడు తపముఁ జేయుచు నేఁటికి మన
దారుకాశ్రమముం జేరెనఁట. సతియు నట్లు శరీరమును వీడి

భావిజన్మంబున నీశ్వరకరగ్రహణముం జేయ నభిలషించి పర్వతరాజతనయయై జనించె. దానం జేసియే యామెకుఁ దపశ్చరణాసక్తి మెండుగ నున్నయది. దానికిఁదోడు మన కలహాశనమౌని పార్వతి విచుచుండ నామె భావిదశను రాజునకు విన్నవించె. అది కారణంబుగ మన హిమవంతుండు వరాన్వేషణమును మాని యీశ్వరుం డల్లుం డగునని ముదంబునఁ దేలుచుఁ దుదకు నిజసుత నీశ్వరున కర్పించె ననువారును, చూచితిరా! మన మేమో యనుకొని యగజ సామాన్యపురాకొమరిత యని యెంచుచున్నారమే కాని యామె మనలఁ గాపాడఁదగిన కన్నతల్లి యని యెఱింగి యామె నాశ్రయింప మైతిమిగా యనువారును, మేనకాగిరిరాజుల జన్మ మెంత ధన్యమైనదే యనువారును, ఇఁక మనల నాగౌరి చూడనొల్లదు కాఁబోలు ననువారును, మన మొకసారి దారుకాశ్రమమునఁ దపముఁ గావించు నుమానీలకంఠులఁ జూచివత్తము రం డనువారును నై యేమేమో తమలోఁదా మూఁ గా దనుచు వాదులాడు కొనుచుండఁ బార్వతీవృత్తమును బ్రచ్ఛన్నముగ నారసి రాఁ బంపఁబడిన యచ్చర లీపురసతుల వాదులాడుటను విని యీ వృత్తమును దమ యేలికకు నామూలాగ్రముగ విన్నవించిరి.

—: ఇంద్రుని విచారము. :—

నిజ పరివారమువలన నింద్రుఁడు పార్వతీవృత్తమును దెలిసికొని బృహస్పతి ప్రముఖ నిఖిలదేవతల రావించి "అయ్యా

లారా! మన పరివార మోషధిప్రస్థమున కేగి పార్వతీ కన్య తప మాచరింప నీశ్వరాశ్రమముం బ్రవేశించె ననియు నామెలకు హిమవంతుఁ డంగీకరించెననియుఁ జెప్పినది. కాన మన మిపు డాయుమానీలకంఠుల వివాహమునకై యత్నింపవ లయు." అని యింక నేమో చెప్పుచుండ దేవకింకరులు విచ్చేసి "దేవా! తారకుండు రంభాద్యప్సరస్త్రీలను జెఱఁబెట్టుచుఁ గల్పవృక్షముల నూఁచముట్టుగఁ బెఱుకుచుఁ దన కెదురైనదేవ వరులఁ జెండాడుచున్నవాఁడు. మన కిఁక బ్రతుకు సున్న యని తోఁచుచున్నయది. మనము పూర్వమువలె నుపేక్షించిన లాభము లేదు. కాన వానిమరణమునకుఁ దగునుపాయమును జింతింపవలయు" నని చెప్పి పోయిరి. అంత నింద్రుఁడు బృహస్పతిని గాంచి "గురువర్యా! బుద్ధిని నినుఁ బోలినవాఁ డేలోకమునను లేఁడు. కాన మన యిప్పటియాపదఁ బోఁగొట్ట నుపాయము నాలోచింపుఁడు. ముందుగ మన మాయీశ్వరునిఁ బ్రార్థించిన నాతండ మనయాపదఁ బోఁగొట్ట నెంచియుఁ జిరకాలవిరహాపేక్షిత యగు నుమను సఫలమనోరథఁ జేయ నెంచియు నుమాపాణిగ్రహణముం జేయు. వారివలనఁ గుమారుం డుదయించు. ఆతండ యీతారకుని సంహరించు. ఇదియ నాకుఁ దోఁచిన యుపాయం" బని చెప్పి యీశ్వరాశ్రమగమనోత్సుకుఁడై యుండె. అంత నిరుపమానధీవిశాలుండును సకలశాస్త్రార్థనిపుణుండును యుక్తాయుక్తవిచారుండును నగు బృహ

స్ఫతి యింద్రునితలంపు నెఱింగి "మహేంద్రా! మన మిపు డీశ్వరుని సందర్శించిన లాభ మేమియును లేదు. మహాదేవుం డిప్పుడు యోగిసదృశుండై సర్వమును వీడి దారుకాశ్రమమునం దప మాచరించుచున్నవాఁడు. మనల నాతఁ డీసన్నివేశమునఁ జూడ నొల్లఁడు. చూచెనుబో మన మొఱ లాలింపఁడు, ఆలించినను మనయిప్పటిమొఱ లాతనివైరాగ్యమును బోఁగొట్టి పార్వతీకరగ్రహణవాంఛను గలిగింప నేరవు. మీఁదుమిక్కిలి మనకార్యముకూడఁ జెడును. కాన మనము ముందుగఁ బార్వతీకన్యను జేరి యామెను బ్రార్థించితిమేని యామెయు నీశ్వరకరగ్రహణమునకై వేచియున్న దగుట నిప్పుడు మనల రక్షింపఁగోరి యమితంబుగ నాతని సేవించి మనసును ద్రిప్పఁగల్గును. మన మీలోపున నిజసుమబాణంబుల లోకంబుల వశపఱుచుకొన వలంతియగు మీనకేతనుని బుజ్జగించితి మేని యాతఁడు వలసిన పూబాణంబుల నాసతీధవునిపైఁ బ్రయోగింపఁగలఁడు. తత్బాణఘాటి కాఁగఁ జాలక పరమేశ్వరుఁడు చెంత నీవఱకే చెట్టవట్టు నుత్సుకతఁ బరిచర్యలొనరించు శైలరాజతనయం జూచి మోహింపఁ గలఁడు. శివుఁడు మోహపరవశుఁడైనకొలఁది మనరతీకాంతుఁడు నిజప్రతాపమును జూపుచుండిన నాతఁడు కింకర్తవ్యతామూఢుఁడై నిజజితేంద్రియత్వమును మఱచి యుమను వివాహ మాడును. ఆ సన్నివేశమునకు గిరిజయు నంగీకరించును. తోడనే మనము

సఫలమనోరథులము కాఁగలము. మన మిపుడు గురులాఘవములఁ బాటింపక ముందుగ సుమబాణుని రావింతము. ఆతఁడు మనప్రార్థనము నన్యథాకరింపఁ జాలఁడు. ఇఁక మీరు విచారింపక రతీకాంతుని రావింపుఁడు" అని చెప్పి యూరకుండె. అందఱును గురువాక్యమున కంగీకరించిరి. తోడనే శచీకాంతుఁడు రతికాంతుని మనంబునఁ దలఁచె.

—: సుమబాణుఁడు వచ్చుట :—

ఇంద్రుఁడు స్వకార్యమును సాధింపఁగోరి కందర్పుని మనంబునఁ దలంప నాతండు త్వరమాణహృదయుండై

సీ. కాంతాననంబుల । కటి వంకబొమలతోఁ
బ్రిఱెవచ్చు పుష్పచా । పంబుతోడఁ
గోకిలవ్రాతంబు । గ్రుక్కిళ్ళు మ్రింగించు
క్రొమ్మావిచిగురాకు । గొడుగుతోడ
రతిదేవి నిడుపోగఁ గ్రా । లుకన్నులడాలుఁ
దలపించు మీన । కేతనముతోడ
భుజగలీలావతీ । భుక్తశేషములైనగంధ
వాహకిశోర । కములతోడఁ
చందురునితో వసంతమా । సంబుతోడ
రాజకీర రథంబెక్కి । ప్రాభవమున
నచ్చెవలరాజు చిత్తాను । వర్తనముగ
సంభ్రమముతోమహేంద్రునా । స్థానమునకు"

వచ్చినతోడనే యింద్రుఁడును ముదం బందుచు సకల మునుల దేవతల నప్సరోగణంబులను వీడి యాతనిఁజూచి చేతికిఁజే యిచ్చి ముదంబున సరిగద్దె నునిచి యొడలు నిమురుచు నాతని మనం బలర సంభాషింపఁ దొడఁగె. అప్పుడు హృది నెంతయు నానందించుచు సుమబాణుఁడు ఫాలతలంబునఁ జేతులు జోడించి "దేవా! తాము న న్నమితవాత్సల్యంబునఁ దలంచుటం జేసి కృతకృత్యుఁడ నైతి. నాజన్మమును సార్థక మైనది. నన్నిపుడు రావింపఁజేసిన కార్యగౌరవం బెట్టిదియో వినంగోరి మనంబు కరంబు కౌతూహలాయత్తం బయ్యెడిని. కాన దయాపూర్వకంబుగ నాచేయవలసిన కార్యంబును సెలవిచ్చితి రేని శక్తివంచన లేక యిప్పుడ యాచరించి దేవర మెప్పు వడయువాఁడ. మీ యీసేవకునకు దేవర కార్యమును మించిన దేదియు లోకంబున లేదు. మఱియు నా కీలోకంబున సాధింపరాని కార్యమును లేదు. వేయేల? దేవా! యింద్రియముల జయించి యడవుల నాకలములఁ దినుచుఁ బర్ణకుటీరముల వసించు మునిజనులుకూడ నాబాణధాటి కాఁగఁ జాలక మోహపరవశులై కామాదివికారములకు లోనగుచుండుట నీవెఱుంగవే? ఇందుకు సందియ మించుకయు లే దని దేవరకు నేఁ జెప్పవలయునా? ఈ ఘనకార్య మీయల్పునివలన సాధింపఁబడునా యని తలంపక నన్ను కార్యసాధనమునకు నియోగింపుఁడు. దేవరముదల యిడి రేని యిప్పుడ దక్షాధ్వరధ్వంసినిగూడ నా సుమ

బాణంబులఁ బీడించి స్త్రీలోలునిఁ జేసి యాతనితపమును గివ
మును ధ్వంసముఁ జేయువాఁడ. ఇఁక దేవరచిత్తము. నాభా
గ్యము.” అని చెప్పి యూరకుండె.

అనుకూలవాక్యములఁ బలికిన సుమబాణునిఁ జూచి
ముదితుండై యింద్రుఁడు చెట్టవట్టి “సఖా, సుమబాణ ! నినుఁ
బోలు మిత్రులు నా కెందును లేరు. నీవు నాకార్యమును నీ
కార్యముగఁ దలఁచి నాకు మాఱుగ యత్నించి కార్యసాఫ
ల్యమును జేయుదు వనియు నాకై ప్రాణంబులఁ గూడ ధారవో
సెద వనియు నెఱుంగుదు. అయినను గార్యంబు తీరుఁ జెప్పినఁ
గాని నీకు సుకరంబుగఁ జేయ వలను పడదనియెంచి నిన్నిట
రావించితి. ముల్లోకంబుల నశ్రమంబుగ నొకేసారి జయింప
వలంతి వగు నీ కీకార్య మొకలెక్క గాదు. లోకంబున శూ
రు లెట్టిదృఢమనస్కులైనను నీబాణధాటి కాఁగలేరు గదా?
అనవరతము నిశాతబాణంబుల జితేంద్రియులను గూడ నశ
పఱుపఁగొన సమర్థుండ వగు నీవు తలంచినకార్యమున కన్య
థాత్వ ముండునే? సర్వవిధంబుల సమర్థుండ వనియు “మిత్ర
మాపదిజానీయా”త్తను లోకోక్తిని బాటింపఁ జతురుండ వని
యు సర్వాత్మనా నమ్మి నీ వను నుడుపంబున నాయీవిపద
బ్ధినిఁ దరింప నుత్సుకుఁడనై యున్నాఁడ. నీట మునిఁగినఁ బా
లమునిఁగిన నీవ పరికృతసన్నివేశమున నాకు గతి. కాన నా
చెప్పఁ బోవు కార్యమును నెఱవేర్చి మిత్రశబ్దవాచ్యుఁడవు

కమ్మని." అనుచు "సఖా! మనల నిపుడు తారకుం డనురా క్షసుండు పలువెతలం బెట్టుచున్నవాఁడు. విశేషించి బ్రహ్మ వరగర్వితుఁడు. ఈశ్వర తేజస్సంభూతుండు కుమారుండు తక్క నొరులు వానిని జయింప లేరు. కుమారజనన మింకను లేదు. శివుఁడు సతీవిరహమున సమస్తమును వీడి కానం దప మాచ రించుచున్నాఁడు. సతియు హిమవత్పుత్రికయై జనియించి యీశ్వరునిఁ బరిణయమాడ నా కాననముననే ఘోరంబుగఁ దపంబు చేయుచున్నది. శివుఁడు పార్వతి ననుగ్రహించి పరి ణయ మాడినఁ గాని కుమారుండు పుట్టఁ జాలఁడు. కుమా రుండు పుట్టినఁ గాని తారకుఁడు మృతి నందఁడు. తారకుఁడు సచ్చినం గాని మనకు యాగభాగంబులు దొరకఁజాలవు. మ ఱియుఁ దారకుండు ముందు మనల నింతకెక్కుడుగఁ బీడించి పిప్పి చేయును. చేయుచున్నాఁ డనునది నీకు నే వేఱ చె ప్ప నవసర ముండదు గదా ! మన మిపుడు పేక్షించిన నీశ్వ రునకుఁ బునర్వివాహేచ్ఛ వొడమునో వొడమదో తెలియ దు. వా రిరువురును బరస్పరముగనుండి తపముఁ జేయుచుండిన మనకార్య మెప్పుడు సిద్ధించును ? ఎప్పుడో వారు తపములఁ జాలించి తమంతటఁ దాము వివాహ మాడెదరని యనుకొందు మన్న నంతవఱకు మనల నీతారకుఁడు ప్రాణంబులతో నుండ నీయఁడు. కాన నీ విపుడు నీ మిత్రుఁడు వసంతుఁడు తోడుగ దారుకాశ్రమముం బ్రవేశించి పద్మాసనాసీనుఁడై ఘోరనిష్ఠఁ

దప మాచరించు సతీధవునిపై సుమబాణంబులఁ బ్రయోగిం
చిన నయ్యవి యాతనిమనంబును గలంచును. అప్పుడ యా
తండు నీ బాణధాటి కాఁగఁజాలక చెంత నీవఱకే పరిచర్య
లొనరించుచు ననమానరూపరేఖావిరాజమానయై నిండు
జవ్వనంబునఁ దులఁ దూగు శైలరాజతనయఁ జూచి మోహిం
చును. పార్వతిని శివుఁడు మోహించినకొలఁది నపరిమత్తుఁ
డవై నీవుండిన మోహంబు నాఁపఁజాలక సర్వమును మఱచి
యామెను బలిమిని వివాహ మాడును. తోడనే నీకును మా
కును బార్వతికిని విజయము చేకూరును. ఇదియ నీకావించు
కార్యము" అనిచెప్పి యుచితసత్కారంబుల నాతనిఁ బరితృప్తునిఁ
గావించి యనిపి తాను సపరివారముగఁ గొలువు సేయుచుం
డె. రతీధవుఁడు దేవకార్యచికీర్షాముఖరితుఁడై యింటి కేగి తన్ను
దేవేంద్రుఁడు తలఁచిన దాదిగ సర్వవృత్తమును నిజసతి యగు
రతికి నిశ్శేషముగ వినిపించె.

—: రతీమన్మథసంవాదము :—

అనుకూలవతి యగురతి నిజనాయకుని యత్నమును
గని పతివ్రత యాట భావిదురవస్థను మనమున నూహించి వివ
ర్ణవదనంబున భర్తృసమీపంబున నిలిచి "నాథా! తా మి
పుడు దేవకార్యమును సాధింప నేగుట యెంతయుఁ బ్రమాద
జనకము. సర్వజ్ఞుండును, నింద్రియజేతయు, రాగవిదూరుండును,

నాశ్రితావనతత్పరుండును, త్రిపురాసురజేతయు, ఫాలలోచనుం డు నగు నాసతీధవుం డేడ? సామాన్యుల మగుమన మేడ? ఆతనితోడి వైరము మనకుం జేటునకు మూలము. నీ విపుడు సతీధవుని సామర్థ్యమును గుర్తింపలేక యేమేమో వారిని వీరిని సుమబాణంబుల జయించితి ననుగర్వంబునం దలపడియెదవే కాని యాతని మ్రోల నిలువ నీకు శక్తి యున్నదే? స్వార్థ పరుండై యాయింద్రుఁడు నిన్ను బుజ్జగించి యిక్కార్యమునకుం బురికొల్ప నీవును నొకశూరునివలె నటించుచు నాపూవును నీపూవును గైదువులుగం జేకొని యీశ్వరుని జయింపం బరువిడుచున్నావే కాని నీ సామర్థ్యమును చాటింపనైతివిగా? ఆయింద్రుఁడే స్వయముగ నాయీశ్వరునో యాయుమనో ప్రార్థించి స్వకార్యమును సాధించుకొనంగూడదా? ఆబృహస్పతి యేగి నిజబుద్ధిసామర్థ్యంబున నిక్కార్యమును సాధించినం గాదను వా రెవరైనం గలరా? అప్రతిమప్రభావు లగు నింద్రబృహస్పతులే యీశ్వరునిం బ్రకృతసందర్భమున సందర్శింప భయపడుచుండ నీ వేమోమున నిక్కార్యభారమును భరింప నంగీకరించితివి? ఈశ్వరుఁడు లోకములోనివారివలె నబలలతగులంబు విడువలేక నీ యీసుమబాణంబుల కెర యగుననియా నీయుద్దేశము? అట్లైన నీవటకే నీబాణంబుల కెర గాండా? ఇంద్రియంబుల జయింపలేక సంసారంబున మ్రుంగు మూఢమానవులు కాంబట్టి యీవఱకు నీయాటలు సాగినవి. ఇప్పు

డన్ననో యింద్రియజేతయు సంపూర్ణవిరాగియు నగు నాయీశ్వరుఁడు నిన్ను సరకు చేయునా? ఇదివఱ కెందఱో యమ్మలు నీదార్ఢ్యమునకు వెఱచి యనరానిమాటల నాడుచు నిందించుచుండుట నీ వెఱుఁగవే? మఱియు వారు నిన్నెన్నోవిధంబుల శపించుచుండుట నీవు వినలేదా? ఈనిందలు చాలక యిప్పుడీశ్వరవైరమును గూడఁ గల్పించుకొన నుత్సహించితే? అహహా! యేమి నీ యీసాహసము? ఈశ్వరు నెదిరించి నీ విఁక బ్రతుకఁ గలవే? ఆజ్యధారాజ్వలితశిఖిశిఖాజాలంబును శలభంబుచందాన నీవును శిఘ్రతఁ జేరఁజూచెదు? నే నేమి చెప్పుదు? తన్ను మాలినధర్మము లోకమున నింకొకటి యున్నదే? జీవ ముండినఁగదా పురుషార్థము సిద్ధించుట? జీవమేపోవునన్నఁ బురుషార్థము సిద్ధించిన నేమిలాభము ? ఆత్మవినాశహేతు వగు నీయుపకృతివలన నేమి యయ్యెడిని? అనుకూలవతి నగు నామొఱ లాలించి యీయుద్యమమును మానుము. ఇంద్రుఁడంతటివాఁడు యాచింపఁ నేఁ జేయఁజాలనని చెప్పుటకా లజ్జించితివి? చతురుం డగుశచీపతి యేరీతినైనను స్వకార్యమును నిర్వహించుకొనగలఁడు. అబలను, బతివ్రతను, నేపాపము నెఱుంగనిదానను నగు నాప్రార్థనము నంగీకరించి నాకుఁబతిభిక్షనిడుము. నీ కొకవేళ నసత్యతాదోషము వాటిల్లు నందు వేమో? ధర్మపత్ని నగు నామొఱను ద్రోసివేయుట యధర్మము గాదా? అర్ధాంగిని నగునన్ను నాథను జేసి నిజస

త్యమును నిలుపుకొనుట నీకు ధర్మ మనితోఁచెనే?" యని చెప్పు చుండ సుమబాణుఁడు "రతీ! నీ వెందుల కిట్లు భీతిల్లెదు? నా బాణంబులకు గుఱిగాని పురుషు లెందునుం గలరే? నీవేమొ లోకంబుల యమ్మలు నన్ను దూఱెదరందువే కాని వారు నా వలనఁ బొందుసుఖంబుల నీ వెఱుంగుదువే? మొదట వారు నన్ను నిందించినను పిమ్మట నన్నే తలంచుచు సమయము చిక్కినపుడెల్ల నాపూజలు సేయుచుఁ బ్రార్థించుచుండుట నీ వెఱుంగవే? చిన్ననాఁటనుండియు నతివలన్న నేమో యెఱుం గక కానలం దిగంబరులై పరమాత్మ నన్వేషించు యోగివ రులుకూడ నాబాణంబుల కెర యగుచుండ భార్యావియో గజనితవైరాగ్యంబు తన్నుద్వరసేయఁ గాన నుండు శివుఁడా లొంగఁడు? ఇస్సిరో! యింతటి జేలవా నీవు? ఈశ్వరుఁడైనను నీశ్వరుఁడైనను సరే! ఇపుడ నాబాణంబుల కాతని గుఱిచేసి స్త్రీలోలుఁ డగునట్లును దుద కర్ధశరీరమును నిజభార్య కొసఁ గునట్లును జేయువాఁడ. ఇంత నిక్కువము. నీ విఁక మనంబునఁ జింతిల్లక సుఖంబుండుము. నే నిప్పుడ పోయి చిరకాలవిరహ దందహ్యమానమానసుఁడై కాన నిరాహారతఁ దప మాచరించు ను మానీలకంఠులఁ బొందుపఱచి దేవకార్యమును సాధించి యా యిందునియొక్కయు నీయొక్కయు మెప్పు వడయువాఁడ" నని తన కడ్డు వచ్చినరతికి ధైర్యముం జెప్పి తనకు మృత్యు వా సన్నమగుడు "వినాశకాలే విపరీతబుద్ధిః" "అత్యుచ్ఛ్రయః ప

తనహేతుః" అను నార్యోక్తులు యథార్థంబు లని చెప్పుటకు గావలయు మాధవసహితుఁడై యీశ్వరాశ్రమమునకు బయలు వెడలెను. ముగ్ధహృదయ యగురతి భర్త తనయుపదేశమును జేకొనమికి మనంబునఁ గుందుచుఁ జేయునది లేక దుర్నిమిత్తపరంపరాకృష్టచేతస్కురాలై సర్వదా రాఁగల యాపదనే తలపోయ మొదలిడెను.



# మూఁడవ ప్రకరణము.



—:ఈశ్వరాశ్రమము:—

పూవిల్తుని యాగమనము నాకాంక్షించుచు నింద్రాదులు గిరిధన్వియాశ్రమోపాంతభూములయందు వేచి యుండి తమలోఁ దా మేమో వాదులాడుకొనుచుండిరి. అంత శంబరారి సస్నేహితుఁడై వారల సమీపించెను. వసంతసఖుని యాగమనమున కెంతయు మనంబున సంతసించి యింద్రుఁడాతనిఁ గార్యసాధనమునకై త్వరపెట్టెను. త్వరమాణహృదయుండైన సుమధన్వి కనుసన్న వసంతుండు నిజపరివారముతో నాదారుకాశ్రమంబున నెటఁజూచినఁ దానయై యుండెను. ఇదివఱకే యయ్యాశ్రమంబునఁ దపముజేయుచు నీశ్వరకరుణాసంపాదనాసక్తచిత్తయై యుచితసపర్యలఁ గావించు నగజ యప్పుడ తపము చాలించి సుమాపచయంబునకుఁ వనంబునఁ దిరుగుచుండ నామెకు దారుకాశ్రమము నవవసంతసమాగమంబున విగతజీర్ణపత్రంబును, నవోదితపల్లవంబును, గుసుమితతరుషండమండితంబును, భ్రమరఝంకారనాదాభిశోభితంబును జాతపల్లవగ్రాసాభినందితపరభృతారావరమ్యంబును, బికనికరరుతాభినందితంబును, మలయానిలసంచారయోగ్యంబును నై యపూర్వరామణీయకంబున నింపుఁ గొల్పుచుండె. దాని

గాంచి యగజ తపస్విని యయ్యు ద్విగుణీకృతేశ్వరకరగ్రహణకుతూహలినియై నవవసంతలక్ష్మి తన్నుఁ ద్వరసేయ సుమాపచయంబు గావించి యీశ్వరునిమ్రోల నిలువంబడి యొయ్యారంబున సుమంబుల నందించుచుండెను. సుమబాణుఁడు తగు సమయమునకై వేచి నిజబాణపరంపరల నీశ్వరునిపైఁ బ్రయోగించి యాతని తపోభంగముఁ గావించి స్త్రీలోలుఁ డగునట్లు చేయనెంచినవాఁడౌటఁ గనుగలిగి యూపాంతముననే యుండెను. శివుఁడు తనకుఁ బార్వతి నిర్హేతుకంబుగఁ జిరకాలము నుండి సపర్యఁ గావించుచుండఁ దాను బ్రాణాయామపరత శార్దూలచర్మంబున నాసీనుఁడై యుండె. పార్వతి యనుదిన మట్లు శివునిసపర్యల నేమఱక చేయుచు నిజాశ్రమమునఁ దప మాచరించుచుండెడిది.

## —: వసంతప్రభావము :—

ఇట్లుండ నొకనాఁడు పార్వతి నిజపర్ణకుటీరమునఁ బ్రవేశించి యొకతమ్మునీడఁ దప మాచరించుచుండ వసంతుఁ డాయమమనంబును గలఁతఁ జెందింప నిజపరివారంబున కాజ్ఞ నిడెను. తోడనే యన్వర్థనాముం డగు గంధవహుఁడు నవసుమపరిమళభారంబును వహించి యందందుఁ జరింప మొదలిడెను. అత్తఱిఁ బద్మభ్రాంతి నగజమోమును జేరి మకరందపానాభిలాషఁ దేఁటి యొండు రొదసేయుచుండ నద్దాని వారింపఁగోరి

యామె నలువలంకులఁ దిరుగాడఁజొచ్చెను. దాన నామె కించుక చిత్తవిభ్రాంతి జనియింప నామె యాకస్మికముగఁ దన కుఁ గలిగిన యాచిత్తవిభ్రాంతి కెదఁ గారణ మాలోచించు చుండ నీవలకే యామె మనంబును గలంచుచుండు గంధవ హాభ్రమరములకుఁ దోడు కోకిలారావములును వానికి దోడు శుకనికరంబుల మధురరుతంబులును వానికిఁ దోడు క్రొన్ననలఁ జెన్నొందు లతానికుంజంబులును వానికిఁ దోడు వల్లు లల్లిబిల్లిగ నల్లుకొనియుండుటచే నవవధూయుతు లగు యువకుల చందాన విలసిల్లు లేమావిగున్నలును సుమఫలభా రానతతరుబృందంబులును, దన మనంబును గరంబు కలఁత నొందింప నారంభించినవి. పాపము! ముగ్ధహృదయ యగు పర్వతరాజతనయ నిజతపోవిఘ్నమును దనకుఁ గలిగిన యపూర్వమనోవికారంబును నాశ్రమరామణీయకమును గాం చి కింకర్తవ్యతామూఢయై కానఁ బరిభ్రమించుచుండెను. అంత దేవకార్యము త్వరసేయ నాసన్నమృత్యుదేవతాప్రభా వుం డగురతీధవుఁడు వసంతుని బ్రోత్సహించి తాను శివుని యాశ్రమంబున నిజనిశితబాణంబుల సిద్ధపఱచి సమయాన్వేషి యై యుండె.

—: శివుఁడు మోహపరవశుఁ డగుట :—

అత్తఱిఁ బార్వతి కానం బరిభ్రమించియుఁ దనమనము కుదుటఁ బడమి నెంతయు సంతప్తురాలై కార్యాంతరవ్యాపృ

తురాలైనఁ జిత్తవిభ్రాంతి యడఁగునేమో యనుభ్రాంతిచేఁ బూర్వపురీతి సుమంబులఁ జేకొని ధ్యానపరుండై యుండిన యీశ్వరుని మోలి సమయంబునకై ప్రతీక్షించుచు నొయ్యారంబు మీఱ నవనతవదనయు, ఫాలన్యస్తాంజలిపుటయు నై యుండె. అంతకుఁ బూర్వమె సజ్జీకృతచాపుం డగుమదనుండు సురపొన్నమోకలనీడ నిలిచియున్నవాఁ డగుటఁ బార్వతియొయ్యారంబును గని యదియ తనకుఁ దగినయద నని భావించి ప్రత్యాలీఢపాదంబున నధిజ్యశరాసనుండై మందమంద సంచారంబున నీశ్వరుని సమీపించి భయకంపితగాత్రంబున నందంద సమయమునకై దాఁగుడుమూఁత లాడుచుండెను. గిరిజ యయ్యెడఁ దనకు మనోవికారం బధికం బగుడు శివునిపైఁ బుష్పాంజలి విడుచుచుండ నీశ్వరుండును సమాధినుండి లేచి దయాపూర్వకంబుగ నామెను గాంచె. పార్వతి తన్నుఁ బ్రసన్నుండై చూచు శివుని పాదంబులఁ బ్రసూనమాలలం బడవైచి హావభావవిలాసంబులు దోఁపఁ దత్పదరాజీవంబులకుఁ బ్రణుతి యొనర్చె. ఫణిహారుఁ డంత నామెభక్తి కెద నానందించుచుఁ "దరుణీ! నీ వచిరకాలంబుననె సరిలేని మగనిం బడయు" మ నుచుఁ బల్కె. గిరిజయు "నాథా! యిది తథ్యము. ఈశ్వరభాషితమునకుఁ దరతరములయందైన నన్యథాత్వము గలదే" యనుచు నాతనిని సవిలాసంబుగఁ జూచుచుండె. అంత నిందిరయజేత యగు నీశ్వరుండును మోమునఁ

దరహాసచంద్రికలు చిందులాడ నామెను జూచుచుండె. పంచశరుఁడు తత్పరత బాణవిమోక్షణకాలముం బ్రతీక్షించుచు నెప్పుడు హరుఁడు పార్వతిని మోహావశంబునఁ జూచునో యనుచు వింట నారి సారించుచుఁ జెంతనే దేవకార్యచికీర్షాయత్త స్వాంతుఁడై యుండె. అప్పుడు గిరిజ పృథులమందాకినీబీజమాలను హస్తపల్లవంబులఁ బ్రియ మొప్ప నీశ్వరునకు సమర్పించె. హరుఁడు గిరిజ యొసంగినపుష్పమాల నధికాదరము దోఁప నందుకొనియె. వెంటనే పుష్పసాయకుఁడు సమ్మోహనాస్త్రమును శివునిపైఁ బ్రయోగించె. మన్మథబాణోపహతుఁడై త్రిపురాంతకుఁడు మనసు పట్టఁజాలక సరసప్రేమంబునఁ బక్వబింబాధరమును గర్ణాంతాయతనేత్రంబును నతిస్వచ్ఛంబు నైన గౌరిముఖంబును జూచుచుండె. శైలసుత యీశ్వరుని భావమును దెలిసికొని స్త్రీస్వభావం బగులజ్జ తన్నువేధింపఁ బులకితగాత్రయు నమ్రవదనయు నై యుండె.

## —: మన్మథమరణము :—

ఈశ్వరాశ్రమమున రతీకాంతుని పరితాపముంజూచు వేడ్క నందందుఁ బ్రచ్ఛన్నరూపంబులతో నుండినయింద్రాది దేవతలు పార్వతీపరమేశ్వరుల ప్రథమసమావేశమును మన్మథుండు వారిపై బాణప్రయోగముం జేయుటయుఁ జూచుచు మనముల నాఁటితోఁ దమబాధలు గట్టెక్కినవని యెంచి ము

దం బంపుచుండిరి. పాపము! సుమబాణుండు నిజకార్యము నెఱ వేఱె ననియెంచి యీశ్వరుఁడుకూడ నిజబాణంబుల కెర యయ్యె నని తలంచుచు గర్వించి యందందుఁ జరించుచుండె. అంత నీశ్వరుఁడు విజితేంద్రియుఁ డగుటఁ దన కాకస్మికముగఁ గలిగిన చిత్తవ్యామోహమునకుఁ గారణ మారయ నెంచి నలువలంకులం బరికించి చూచుచుండె. అంత ముదంబున నెడ లెఱుంగక కట్టెదుర నిలిచియుండిన "దక్షిణాపాంగవినిష్ఠ ముష్టియు నానతాంగుండును నాకుంచితసవ్యపాదుండును జక్రీకృతకార్ముకుండును బ్రహారోద్యుక్తుండును నైన మన్మ థునిం గనుంగొని" నిజతపోభంగముచు గావించిన వానిఁగ నెఱింగి కోపపరీతచిత్తుం డయ్యె. అయ్యెడ నింద్రాదిదేవతలు దక్షాధ్వరధ్వంసి కోపపరీతచిత్తుఁ డగుటం గని తమకును మన్మ థునకును నాఁటితో నాశము ప్రాప్తించుననుచు భయమంది "దేవా! ఆపదుద్ధారకా! రక్షింపుము. కోపము నుపసం హరింపుము" అనుచు మొఱలిడుచుండ నామొఱ లాతని మదిని గరఁగింపవయ్యె. మఱియుఁ గ్రోధం బినుమడించుచుం డె. అంత "భ్రూభంగదుష్ప్రేక్షుణం బగు విరూపాక్షుని లలా టేక్షణంబునం జనియించిన సముజ్జ్వలజ్వాలాజాలం బైన కృపీటయోని భువనంబులెల్ల భయభ్రాంతంబులై హాహాకారం బులు సేయ నమ్మన్మథకేతను శరశరాసనతూణీరంబులతోడం

గూడ భస్మంబుచేసిన" ఈశ్వరుఁడు యువతిసంసర్గంబు యోగవిఘ్నం బనియెంచి పార్వతిని వీడి కైలాసంబునకుఁ జనియె. వసంతుండును నిజసఖుని దుస్థితిని గని యీవఱచినచంద్రాననేడ్చుచు నందందుఁ దిరుగాడఁజొచ్చెను. పార్వతి తనమనోరథ మీడేఱమికి మనంబున విచారించుచుండ గిరిరాజు నిర్విణ్ణుఁడైయుండిన యనుంగుఁగూఁతుం దోడ్కొని స్వస్థానమునకుఁ బోయె. ఇంద్రాదులును దమకార్యంబు బూడిదఁబోసిన పన్నీటిభాతి యయ్యెఁగా యని విచారించుచుఁ దమ్మాపద నుండి రక్షింపఁగలవా రెవ్వరయ్యెదరో గదా యనుకొనుచు విచారించుచు స్వఃపురికిఁ బోయిరి.

—: రతీప్రలాపము :—

రతి నిజనాథుఁడు తనకు ధైర్యము జెప్పిపోయినది మొదలనవరతము నశుభమునే యూహించుచు నపశకునంబులనే కనుచు స్వప్నంబునఁగూడ నిజనాథుని మరణమునే కాంచుచు నెటేటో కాలము గడుపుచు నిజనాథుఁ డెంతకును రామిం జేసి ద్విగుణీకృతశోకాక్రాంతహృదయయై మనసు పట్టలేక కాంతునిఁ జూడ దారుకాశ్రమమునఁ బ్రవేశించె. అటుఁ బ్రవేశించియు నిజనాథునిఁ గానమిఁ బొంగి పొరలుచున్న దుఃఖవేగము నాఁపఁజాలక యుపాయాంతరశూన్యయై యటఁగల తరుబృందంబుల, లతానివహంబుల, గిరివరంబుల మఱియు నటఁ

గల సత్త్వంబుల నుద్దేశించి పేరుపేరున నడిగియు నిజనాయకునిజాడఁ గాననేరక తుదకుఁ బురుషాకృతిం భూమిని బడియున్న భస్మంబును గాంచి శోకవేగంబున నిట్లని విలాపింపందొడంగె. "అయ్యయ్యో! నాథా! నేఁటికి నీ కీదుస్థితి నాటిల్లెనే? చక్కనివారిలోను నెఱజాణలలోను గడుఖ్యాతిఁజెందిన నీవు ప్రాణములఁ గోల్పోయిన నేనును ధైర్యమున నినుఁ జెందనైతిఁగా? అకటా! కాంతలు కఠినచిత్తలగుట కిది కదా తార్కాణ! నా కింక నేమిగతి? నాజీవితంబును మనోమానానురాగంబులను నీయధీనముం జేసి యన్యజనచింతాదూరనై యుండ నన్నింటి విడిచిపో నీమన సొప్పెనే? నావలన నేమైన నపచారముం గంటివే? నేనెన్నఁడైన నీకుఁ బ్రతికూలంబుగ వర్తించితినే? ఏపాపము నెఱుంగని నన్నిటుల డించి పో నీకు న్యాయమే? నాథా! చూచితే? నామాటలాలింపక యనవరతము పాంథవనితలను గాఱియపెట్టుచుండుట నీ కీగతి సమకూరెఁగా! ఏరామలు నీబాధ సహింపఁజాలక యిటుల దగ్ధుండవు గమ్మని శపించిరో గదా! ఏవారికిఁగాని పరపీడనము పాటి యగునే? అయ్యయ్యో! నావలె నెందఱెందఱు కాంతలు నీబాధలఁ బడంజాలక విచారించిరోకదా? అహహా! నిను శపించిరే కాని యీఁకముం దాయమ్మలెట్లు వర్తింపఁగలరు? ఇఁక వారి యలంకారము లెందు

కు ? వారిని నాథులకడ కంపు నాయకుండెవఁడు ? నీ యీ పరివారంబునకు నాథుఁడెవఁడు ? నాథా ! యీసుమంబుల నిఁక నెవ్వఁడు బాణంబులుగ నుపయోగించు ? వేయేల ? నాథా ! నీవు లేమిం జేసి యీజగము వెలితివడెను గదా ? నేనును మొండినై యింకను నిను జేరక యీధర బ్రతికియుం డితినే ? అకటా ! "మన్మథ ! మధురాలాపనిసర్గపండితం బులగు గండుఁగోయిలల నేఁకో భువనంబులకు రాయబా రంబు పంపవు? దక్షిణేతరంబగు మదీయచరణంబు లాక్షారా గపరికర్మంబునకుఁ దగదొకో ? పతంగమార్గంబున నింగలం బునం బడి భవదంకం బాశ్రయించెదంగాక ! మదనుండు లేక రతీదేవి జీవించునను నపవాదంబు నోర్వవచ్చునే ? నీసుహృ దీశ్వరుం డైనవసంతుం డెచ్చట నున్నవాఁడు ? పటుకోధ రేఖానటద్భ్రూభంగభీషణముఖుం డగులలాటలోచను లో చనంబుచిచ్చున నతండును వెచ్చి నిన్నుఁగూడెనే ? యని యనేక ప్రకారంబులం బలవింపఁ దత్పరిదేవనాక్షరంబులు బాణపాతంబులంబోలి తూల నాటుటయు నెంతయు నొచ్చి యమ్మాధవుం డక్కోమలియకోమలికిం బుట్టిన మహావ్యసనం బూరార్పం జేరవచ్చుటయు" నక్కోమలి దుఃఖం బాఁపఁజా లక చేదోయి నెత్తి నోరు కొట్టుకొనుచు వసంతు నెదుటం బడి గద్గదఖిన్నకంఠయై పరిదేవనంబు సేయుచుండె. "ఇవ్వి

థంబున నారాము పేరామని యెదుట నెమ్మనంబునఁ బేరా మనివై వర్తిల్లు నార్తిసంబరంబెచ్చి సొమ్మసిలంబోయి లేచి వసంతునిఁ గనుంగొని మాధవ ! నీచెలికానిం జూడుము. కపోత కర్బురంబైన భస్మంబైనవాఁడు. నీవు వచ్చుట యెఱుంగండు సుమ్మీ ! అసురాసురం బైనజగంబు బిసతంతుగుణం బైన కోదండంబునం గలగుండువెట్టు నిట్టి జగజెట్టియుం గలండే ? అతిపరుషసంవాతాహతం బైన దీపంబునుంబోలె నీపరమ మిత్రుండు కరిమ్మఱిలెండు సుమ్మీ ! నాపాపంబునంజేసి విధి వెలిగాఁ గొన్నినవిలుకానిం గొనిపోయె. నీవును బరమమి త్రుండవు గావున నన్నును నగ్నిముఖంబున నీసఖుం గూర్పం బాడి. "శశితోడంగూడఁ గౌముదియు మేఘంబుతోడంగూడ నెఱుఁగు" ననుట సకలసమ్మతంబు. కుసుమశరు శరీర భసితచూర్ణంబు శరీరంబునం దాల్చి నామేను విభావసునం దు వేల్చెద. కిసలయతల్పంబులకు నిటమున్ను సహాయుం డవగు నీకుఁ జితపేర్పంజాల వచ్చెనే ? యని పల్కి శోకా వేశంబున వెండియు,

"సీ. హస్తయుగ్మము మోడ్చి । ప్రార్థించి పలికెదఁ
దమ్ముఁడా నాకిమ్ము । దగఁ జితాగ్ని
మందమందంబుగా । మలయానిలంబులు
వెరవుతో మండంగ । విసరుఁగాతఁ

బరలోకతృప్తికై । బంధు లిద్దఱకును
ధర్మోదకం బిందు । తమ్మితేనె
సహకారమంజరీ । చరుపిండకబళంబు
పెట్టుండు మాకునై । పికము ముట్టి
తేనె పెట్టుండు కస్తూరిఁ । దీర్చి యచటఁ
జేర గొజ్జంగిపూనీటఁ । జెంబు లిడుఁడు
నన్ను వలరాజుఁ దలఁచి మ । న్ననదలిర్పఁ
దగ సమర్పణ చేయుఁడు । దంపతులకు."

అనుచుఁ బెక్కువెతలం గుంది మరణవ్యవసాయబుద్ధి నగ్నిం బ్రవేశింప నాయత్తయై యుండ రతి నుద్దేశించి యశరీరవాణి "యోమన్మథపత్ని! సాహసంబు వలదు. ఈ నీవ్యాపారమునుండి మఱలుము. "జీవన్భద్రాణి పశ్యతి" యన వినవే? చచ్చి నీ వేమి సాధింతువు? బ్రతికియుండిన సర్వంబు శస్తం బగును. నీకుఁ జేరువన మేలుగాఁగలయది. నీ నాథుండు కన్నుఁ గానక భుజాదర్పంబునఁ గనకగర్భునకు మనోవికారంబు పుట్టించి నిజకుమారికయందు బుద్ధివోడము నట్లు గావించె. అతఁడు నిజసుతం గదిసినయన్యాయంబున కెంతయుఁ జింతించి యీదురాత్ముండు హరకోపానలంబున భస్మం బగుఁగాత" మనుచు నీమగని శపించె. నీ నాథుఁడు న్ను నాఁడుమొదలు కన్ను మిన్ను గానక లోకంబున నెటఁ

జూచినఁ దానయై గర్వంబును మదంబును దను ద్రిప్ప నీశ్వ
రుని జయింప సన్నద్ధుఁడై యిట్టిదుర్దశకుఁ బాలయ్యె. ఏరికైనఁ
బ్రారబ్ధం బపరిత్యాజ్యంబు గదా ! నీ విఁక విచారింపకుము.
శివుఁ డెప్పుడు గిరిజను వివాహమాడునో యప్పుడ యామె
ప్రార్థనమున లోకైకవీరుండగు నీమగని నీకుం బ్రియం బొప్ప
నిచ్చు. నీ వీమాటలను నిజంబుగ నమ్ముము. మది వేఱొండు
దలంపకుము." అని యానతిచ్చి యంతర్హిత యయ్యె. తోడ
నే రతి యులికిపడి లేచి నలుదెసలం గాంచి యాకాశవాణిపల్కు
లఁ దలంచుచునుండఁ దనకు శుభనిమిత్తంబులు దోఁచుడు
మరణంబునందలి బుద్ధి చాలించె. మన్మథమిత్రుండగు వసం
తుండును నావృత్తాంతంబునకు ఘనంబుగ నానందించి రతి
నోదార్చె. నాఁటంగోలె రతి పార్వతీపరమేశ్వరుల వివాహ
మును బ్రతీక్షించుచు నెటులో నిజశరీరమును గాపాడుకొను
చుండె.



# నాల్గవ ప్రకరణము.



## —: మేనక పార్వతితపమును వారించుట :—

పర్వతరాజకన్య తనకుఁగాఁ బ్రాణములఁ గోల్పోయిన పంచశరునిఁగూర్చి చింతించియు నిజరూపమును నిందించుకొనుచు నెట్టకేలకు దృఢమనస్కయై తపముఁ గావించి యంధకరిపుని మనమును గరఁగించి వివాహమాడఁ గృతనిశ్చయురాలై యుండ ముగ్ధహృదయ యగు మేనక నిజసుతాభిప్రాయమును గనుంగొని తనకుఁ బార్వతి కానకకన్నసంతానమగుట విచారగ్రస్తురాలై యామె నుద్దేశించి "అమ్మా నీవేడ? ఆశివుఁ డేడ? తపమున నాతనిమనమును గరఁగించుట యేడ? నీయట్టి వెఱ్ఱులు లోకమున మఱియెవ్వరైనఁ గలరా? రాజభోగంబుల నవ్వారిగ ననుభవించు నీవు కానల నాకలములఁ దినుచు శీతాతపవర్షములకు లోనై పర్ణకుటీరమున వసించి యభవునిమెప్పు నేరీతిఁ బడయఁగలవు? నీ వీవఱకుఁ గానఁ దప మాచరించి యేసుఖమును బొందఁగల్గితివి? నీకై పాప మారతీధవుఁడు దగ్ధమాయెఁగా? ఒకమాఱు రుచిమూచియుఁ దృప్తిఁజెందక యింకను శివునికై తప మాచరింప సమకట్టితివా? చాలు; చాలు. ఈమాటల నిఁకఁ గట్టిపెట్టుము. కాంతారంబులఁ జిరకాలమునుండి నిరాహారులై సమాధినుండియు

యోగిజను లేమహామహుని యనుగ్రహమును బడయ లేకున్నారో? యట్టి యభవుని యనుగ్రహమును సుకుమారి వగు నీవా పొందుట? అహహా! యేటిమాట లివి? ఆయభవుఁడు నీయందుఁ బ్రసన్నుండు గాఁదలఁచెనేని మన్మథున కాఁగతి యేలపట్టును? కలహప్రియుఁడు గాన నారదుఁడు నీజనకుని మోసపుచ్చి యేమేమో చెప్పినాఁడు. నీవును నీతండ్రియు వానినే వేదవాక్యములుగ నెంచి యూరక పొంగుచుండిరి. ఆమాటలే నిజమైన నీ విదివఱకుఁ జేసినసేవ కేతృప్తిఁజెంది యభవుఁడు భవుఁడు కాలేకపోయెనే? నీవిఁక మాటాడక తపమును గిపమును జాలించి సుఖానసుండుము. శిరీష సుకుమారం బగు నీ యీకోమలశరీరమును బాడుచేసికొనకుము. తప మన సామాన్య మనుకొనుచున్నావా? అడవుల నుండవలెను. ఆకలములఁ దినవలెను. పడియనీరు ద్రావవలెను. ఎండ నెండుచు వానఁ దడియుచు శీతంబున కోర్చుచు కుశమును వహించి నారలఁ గట్టి పల్లవంబుల ధిక్కరించు నీయీమృదుహస్తంబులఁ గఱకులగు కుశాగ్రంబులఁ గోయుచు జపమాలలఁ ద్రిప్పుచుండవలయును. తప మన బొమ్మపెండ్లిండ్లనియా నీయుద్దేశము? అమ్మా! కన్నకడుపాట నిన్నింతగ బతిమాలుచున్నదానను. కాన నీవును నానుడుల విశ్వసించి యాఖండలాదులలో నీ యిచ్చవచ్చినవారిని వరించి రాజ్యభోగంబుల ననుభవింపుము. ఊరక నీమృదుగాత్రంబును గష్ట

పెట్టకుము." అనుచు నేమేమో వాత్సల్యాంబుకతన హితవు నుపదేశించుచుండఁ బూర్వజన్మజ్ఞానంబుకలిమి నుమయుఁ దల్లియుపదేశములఁ బెడచెవిం బెట్టి నిజసఖీముఖంబున నీప్సితమును దండ్రి కెఱింగించె. మేనకయు నిజసుతమనోదార్ఢ్యమును గుర్తెఱిఁగి యేమియు ననలేరక తూష్ణీంస్థితయై భావికార్యస్థితిని జూచుచుండె.

—: గిరిజ పితాజ్ఞ మునివేషమునఁ గానఁ జేరుట :—

గిరిరాజు స్వసుతామనోరథమును గుర్తించి జ్ఞానవంతుఁ డగుట ననుంగుఁబుత్రి కొదవు భావిభాగ్యోదయమునకును దృఢప్రతిజ్ఞకును గానున్న యీశ్వరసంబంధమునకును మనంబున నమితంబుగ నానందించి యామె వనవాసమునకును దపశ్చరణమునకును నానతిచ్చె. తోడనే జయవిజయలను ననుంగుసఖులఁ దోడుగఁ జేకొని యగజ వివిధాలంకారములను దిగఁబుచ్చి యీశ్వరారాధనతత్పరురాలై కర్కశవల్కలంబులను ధరించె. ఇంకను భ్రమరంబుల ధిక్కరించు విసీలం బగుదీర్ఘకేశకలాపంబును జడలుఁ గట్టె. మఱియు జఘనంబుననుండు ముత్యాలమొలనూలును వీడి మౌంజిని గంమకక్రీడల నాఱితేఱినహస్తంబుల నక్షమాలను గస్తూరికాదిసుగంధంబుల నలరారు శరీరమున ధవళవిభూతిని బెండ్లిపాటలఁ బాడునోట నీశ్వరస్తుతిని బులికళాసంబును ధరించి

హంసతూలికాతల్పంబుల శయనించుబాల బాహువల్లిని త లాడగాఁ జేసికొని కఠినపాషాణతలంబుల శయనించుచు ని ర్జనకాననంబున నొకరమణీయాశ్రమమును మనంబున నీశ్వ రసాన్నిధ్యమును గల్పించుకొని తదేకనిష్ఠాగరిష్ఠురాలై య న్యము నెఱుంగక తప మాచరించుచుండె. అగజాశ్రమంబు చూపఱుల కింపును సొంపును గొల్పుచు నిరామయంబును ని శ్చలంబును నిర్వైరంబును యోగిజనసులభంబును దుర్జన దుర్లభంబును నైయుండె.

"ఉ. పంకజరేణుగంధి యగు । పల్వలవారికరేణు విచ్చె ని
శ్శంక మహావశంబునకు । గంధగజంబును బద్మినీమృణా
లాంకుర మర్ధభుక్తము ని।జాంగనకుం బ్రియమారనిచ్చెనా
వంకతపోధనుల్ హృదయ।వత్సలతన్బ్రియమందిచూడఁగన్."

దానింగని శతవృద్ధు లగుమునిరాజు లాయమ తపోనిష్ఠకును, దృఢమనస్కతకును, భావిపరిభావశక్తికిని మనంబుల నచ్చెరు వందుచుఁ ద్రికాలంబులయందును బ్రణతు లగుచుండిరి. స్వార్థపరుఁడౌట నిందురేఁడు పరసహనాభావుఁడై యితరుల తపోవిఘ్నము నాచరించుస్వభావము కలవాఁ డయ్యు నుమ చేయుతపమున కావంతయేని విఘ్నము నాచరింపనొల్లక యూమె పరంపరాభివృద్ధినే యెద నాకాంక్షించుచుండెను.

"ఇవ్విధంబున ధరశిఖరంబులయందలి హరిణకిశోరంబులకు నరణ్యబీజాంజలినిధానంబును దరులతాకుంజంబులకు నిర్ఝరధారాసేకంబును నొనర్చుచుఁ గృష్ణాజినోత్తరాసంగవతియు సర్వాంగభసితాభ్యంగమంగళస్నానయు నై కొంతకాలంబు గడపి కాంక్షితంబు కడఁగానక తెంపు సేసి మండువేసవిం గనకనమండు నగ్నిముఖంబునడుమున నిలిచి మధ్యాహ్నకాలంబున నర్కమండలం బాలోకించియు వర్షాకాలంబునఁ బక్ష్మపాళీస్థితంబులును దాడితాధరంబులును దివళీవలయస్ఖలితంబులును నాభీగహ్వరప్రవిష్టంబులును నగు జలధర జలబిందుధారలం దోఁగియు శిశిరకాలంబునం దివతాళించు కొలంకులలోనం బుక్కిటిబంటినీట నిశాసమయంబుల నిలిచియు నంబుచుళికంబులును, నుడుపతికరంబులును, గరువలిఁ దూలిన జీర్ణతరుపర్ణంబులును నాహారంబుగా దుష్కరం బైనతపంబు సేయుచుండె."

దానం జేసియే వివిధాశ్రమంబుల నుండు మునితల్లజులందఱును బార్వతి నియతనిష్ఠ కెంతయు సంతసించుచు నామెను వేనోళ్ళం బొగడుచు నామెచరణరాజీవంబులకుఁ బ్రణమిల్లుచుండెడివారు. పార్వతియు నటులఁ దపం బాచరించుచు, స్వాశ్రమదిదృక్షువులై యేతెంచిన మునుల విప్రుల నతిథుల నుచితసపర్యలఁ దృప్తిపఱచి స్వవ్యాపారములయం దప్రమత్త

రాలై యపర్ణయనియు, నుమ యనియు వ్యవహరింపఁబడు
చుండెడిది.

—: పార్వత్యాశ్రమమునకు బ్రహ్మచారి యేతెంచుట: —

అట్లు పర్వతరాజతనయ శమదమాదిగుణంబుల నలరారుచుఁ దపము గావించుచుండ నొక్కనాఁడు,

"మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముం
బోలె నా
త్రిజగన్మోహనమూర్తిసన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్"

ఈరీతిగ నేతెంచి యక్కపటవటుండు కుశపవిత్రాక్షతసంయుతం బగుదక్షిణకరంబు సాఁచి "కల్యాణి! నీకు సర్వంబు శస్తంబగుఁగాత" మనుచు నాశీర్వదించె. తోడనే యపర్ణయులికిపడి లేచి ససంభ్రమహృదయంబున నాభూసురకుమారుం గని సప్రేమ బహుమానపురస్సరంబుగ నర్ఘ్యాదివిధులఁ బరితృప్తినిఁ గావించి యుచితాసనాసీనుం గావించె. మాయావటుండును బార్వతిసపర్యల సంతుష్టిఁ జెంది క్షణమాత్రము శ్రమాపనోదము గావించి యీషదంకురితమందస్మితభాసురముఖుండై ప్రసంగోచితంబుగ నిట్లనియె. "సారసాక్షి! నీకిటఁ ద్రిషవణస్నానోచితం బగుజలంబు సులభం

బుగ దొరకుచున్నదా? భాసురాంగి! సుమంబులును, కుశలును, బల్లవంబులును నిధ్మంబులును సుకరంబుగ లభించుచున్నవిగదా? శశివదన! యిందలిసత్త్వంబులు స్వజాతిసామాన్యం బగువైరంబును మాని సఖ్యంబున మెలంగుచున్నవిగదా? తలిరుఁబోఁడి! జీవిక కనువగు నీవారపాకాదికము లభించుచున్నదా? ధర్మసాధనమునకు ముఖ్యకారణం బగుశరీరంబు నీరోగంబుగ నున్నయదియా? ఫలాపేక్షను వీడి శక్తివంచన లేకుండఁ దపశ్చరణముఁ గావించుచుందువా? మఱియు నతివా! నీపెంచిన లత సుమపల్లవాలంకృతయై వర్ధిల్లుచున్నదా? పద్మలోచన! అభ్యాసవశంబున నీకరస్థదర్భాంకురముల మేసిన హరిణశాబకములను శాంతిని వీడి బెదరింపవుగా? అరాళకుంతలా! నీయుదయంబునఁ జేసియే గిరిరాజు వియద్వాహినికంటెఁ బావనుఁ డయ్యెఁగదా? పద్మగంధి! సత్పురుషులతో నేఁడు మాటలనాడిన సంబంధము కుదురు నని చెప్పుదురు గదా? నే నింతదనుక నీతోడఁ బ్రసంగించుటచే నీ కాప్తుఁడ నయితిని. కాన బ్రాహ్మణజాతిసామాన్యం బగుచాపలంబు త్వరసేయ నొక్కమాటాడ సాహసించితి. దాని కాఁగాదనక రహస్యంబు గాకుండెనేని యథార్థము వచింపుము” అన గిరిరాజసుత యాతని సాదరంబుగఁ జూచుచు “తాపసవర్యా! మీముఁబోఁటితపోధను లనవరతము వచ్చుచుండుటం జేసి నాయీయాశ్రమము పవిత్రతమమై నిరామయమ్మై వర్ధిల్లుచున్నది. నాదే

హంబును దపంబును గూడ వర్ధిల్లుచున్నవి. నా కిట నేలోపంబులును లేవు. నా శాంతికిఁ గూడ నేభంగమును వాటిల్లుట లేదు. విశేషించి మీదర్శనముంబట్టి కృతార్థురాల నైతిని. కాన భవదీయానుగ్రహభాజనురాల నగు నాయందుఁ దా మమితవాత్సల్యంబును జూపుచు నడుగఁదలఁచుకొనిన ప్రశ్నం బెట్టిదియో వినఁగోరి మనంబు కరంబు కౌతూహలం బందెడిని. అన్యకార్యాతిపాతము గాకుండెనేని సావధానంబుగఁ దామడుగవలసినదాని నడిగిన నాయోపినకొలందిఁ జెప్పుదాన" నని చెప్పి వినయవినమితశరీరయై యుండె. ఆమె వినయంబునకును, ప్రౌఢిమకును, భక్తికిని, రూపయౌవనసౌందర్యాదులకును మనంబున ముదంబందుచుఁ బ్రచ్ఛన్నరూపధారి యగు సతీకళత్రుండు తా నడుగవలసినదాని నడుగఁ బ్రారంభించె.

—:మాయావటువు పార్వతీహృదయముఁ బరీక్షించుట:—

అండజయాన! నీవు పరమపవిత్రమైన కులమునఁ బుట్టితివి. నీకు సౌందర్యమునకుఁ గొదువ లేదుగదా? సంపదయన్నను జిరస్థాయిగదా? సౌఖ్యమున కేకొఱంతయు లేదుగదా? సర్వసామగ్రియు నీయధీనమై యుండియు నీ కేవిధమునఁ గూడ లోపము లేదే? అట్టి నీవు పరమ సుకుమారంబైన శరీరంబును గృశింపఁజేసి యెందుల కిట్టిఘోరతపంబును జేయుచున్నదానవు? నీమనోరథం బెద్దియో చెప్పుమా; మాతము.

నినుఁజూడ నాకును విచారము గల్గుచున్నది. నీయట్టి యబలలకుఁ దపశ్చరణం బుచితం బగునే? పితృభవనంబున నవమానంబు పుట్టదుగదా? నినుఁ గన్నెత్తి చూచువారును గలరే? నవయౌవనోచితంబు లగుభూషణాబుల వీడి వార్ధకోచితంబు లగునారల నెట్లు కట్టితివి? నీ వొకవేళ దేవలోకము నాశించితేని నీజన్మభూమి దేవభూమియకదా! దాన నది వృథాశ్రమంబు. ఇఁక యుక్తవరాకాంక్షివై యుంటివేని యదియు నీయట్టిదాని కనుచితము. రత్నం బొరుచే నన్వేషింపఁబడునుగాని యొరు నన్వేషింపదుగదా? ఏదో నీమనమున దుర్లభం బగుకోర్కె యున్నటులు దేటపడుచున్నది. లేనిచో నీకిట్టి వ్రతాచరణ మెందులకు? ఏకతనహృదయుంగూర్చి యిట్టితపమును జడలను ధరించి నీవు చేయుచున్నావో? నా కెఱిఁగించిన వాఁడు సులభుండో? దుర్లభుండో? చెప్పెద నను చు నంతతోఁ దృప్తిఁజెందక యామాయామాణవకుండు,

"ఉ. ఏనును బ్రహ్మచారిఁ దర ళేక్షణ నీవును గన్య వెంతకా
లానకు నీకుఁ బెండ్లియఘ ళలం బగునేని విచారమేల స
న్మానముతోడ నచ్చునను ళమాన్యవివాహముగమ్ము లెమ్ముకా
దేనిఁ దపంబులోని సగ ళమిచ్చెదమానుతపోభిమానమున్"

అనినం బార్వతి యమ్మిథ్యావటునకుఁ దనమనోరథం బెఱిఁగింప నొల్లక వయస్యకుం గనుసన్న చేసిన నచ్చెలికత్తె

యు నత్తపోధనకుమారునితో నిట్లనియె. "అయ్యా! నీకుం గుతూహలము గల దేని వినుము. కాలకంఠకఠోరకంఠహుంకారపరివర్తకం బగుపుష్పచాపుని సమ్మోహనాస్త్రం బీకన్య హృదయంబున నాటిననాటంగోలె లలాటచందనధూసరాలకయై తుహినసంఘాతతతశిలాతలం బగు జనకునింట ధృతిం జెందక మహేంద్రప్రభృతు లగుదిగీశుల నుజ్జగించి పినాకపాణిం బతిగాం గోరి తపంబు సేయ సమకట్టె. సబాష్పకంఠస్ఖలితంబు లగుసంగీతాక్షరంబుల విరూపాక్షుచరిత్రంబు పాడుచు వనాంతసఖు లగుకిన్నరరాజకన్యకల వగపించుచుం ద్విభాగశేషంబు లగునిశాసమయంబుల నించుకించుక నిద్రించుచుం గలంగాంచి నీలకంఠ! యెచ్చోటికిం జనియెదవు? అని యసత్యకంఠార్పితబాహుబంధన యయ్యును విరహవ్యథాదుస్సహం బగుతపోభారంబున భర్త వశీకరింపం దలంచియున్న యది యని పల్కిన,

"చ. వికవికనవ్వి యక్కపట విప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికినయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి యీ
సకియ వివాహవేళం బుర శాసనుపాణిం బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహి మ్రోఁగిన నెట్లుభయంబు
చెందునో."

యనుచు "ననఁబోఁడి! యేమి నీ యీ వెఱ్ఱి? ఇన్నినాళ్ళుడవులం బర్ణంబులనైన భక్షింపకుండం దపము సేయుట

యాయీశ్వరుని గొలుకా? ఆతనివైభవము నీకుఁ దెలియదు కాఁబోలు! అతనిఁగట్టుకొని యేమిసుఖము ననుభవింపఁదలఁచితివి? సంపదలేకున్న నుండుట కిల్లయిన నుండినఁ జాలు నంటివా? ఆతనియిల్లు రుద్రభూమికదా? పోనీ! తిండియుండినఁ జాలు భవన మేలయందువా? అనుదిన మాతఁడు భిక్షాటనము సల్పుటచే నదియు సున్నకదా? ఆభరణము లందువా? ఎప్పుడును విషాగ్నులను వెదచల్లు నాలుకలుగల సర్పంబులుగదా యాభరణంబులు? శరీరము సుందరమైనదని యందువేమో! ఎప్పుడును శవభూతిభూషితమై రోఁతఁ గలిగించుచుండును గదా ? మఱియు నాతనికి రక్తసిక్తంబగు వ్యాఘ్రచర్మంబు గదా వస్త్రము? హారములన్నఁ బునుకమాలలుకదా? వాహనమంటివా? కన్నులును గాళ్ళును లేని ముసలియెద్దు గదా? మఱియు గంగాసంబంధమున నెప్పుడు నాతనిశిరము పాఁకుడు గలిగియుండును. మోమున మంటలుమండుచున్న నేత్రముండుటచే నాతని మోమ్రోల నెవరును నిలువనేరరుగదా? జంతుకోటి కాతఁడన్న భయముకదా? నామములుమాత్రము మంచివా? రుద్రుఁడు; హరుఁడు. నామమాత్రమున నే యాతఁడుఁ దుష్టుఁడని తెలియుచున్నది. నిజంబుగ నెంచి చూడ నాతనియందు సుగుణం బొకటియయినం గలదా? ఆతనికై తపముఁగూడఁ జేయవలయునా? నీజనకులు నీ యుద్యమమున కెట్లనుమతించిరి? నీ తలిదండ్రులు గృహాహీ

నుఁడు మాతృహీనుఁడు పితృహీనుఁడు భ్రాతృహీనుఁడు బంధుహీనుఁడు భాగ్యవిహీనుఁడు నగునల్లుఁడు కావలె ననియెంచి నిన్నుఁ దపంబునకుఁగూడఁ బంపిరా? మీదేశంబున నీపాటి సర్వహీనులు దొరకకపోయిరా? చాలు; తపము నిఁకఁ గట్టిపెట్టి సదనంబునకుఁ బొమ్ము. నీయట్టి సర్వాంగసుందరికిఁ దగినవరు లెందఱో యుండ వారిని వీడి యీగర్భదరిద్రునా చేపట్ట నెంచితివి? ఇంతటి బేలవా నీవు? నీవృత్తముచూడ నాకు జాలి కలుగుచున్నది.'' అనుచుండ గిరిరాజసుత,

"ఉ. చాలు వివాదము ల్పదిగ శంభునిగూర్చి యిట్టిపల్కు లీ
వాలముచేసి పల్కితివి యైనను నా విను చంద్రమఃకళా
మౌళిపయి న్మదీయమనమానస మెంతయుఁ జిక్కెనింక నేఁ
జాలుదునయ్య యె మ్మెయిభుజంగవిభూషణుఁ బొందొరంగఁగన్."

అనుచు రోషారుణనేత్రయై జయవిజయలం గనుంగొని "సఖులారా! యీబ్రహ్మచారి యింకను నాప్రాణవల్లభుని గూర్చి యవివేకంబుకలిమి నేమేమో పలుకనెంచి యున్నవాఁడు. నే నద్దానిని సహింపఁజాలను. మీ రిఁకఁ బాపంబు పుణ్యం బనియెంచక యిప్పుడ యీతని మెడపట్టి యవతలికిఁ బంపివేయుఁడు. ఆలసింపకుఁ డనుచుఁ గటకటం బడి కోపవేగంబున నటనుండి నాలుగైదడుగులు దాఁటి యవ్వలికిం జని బ్రహ్మచారి మఱలఁ దననైపునకు లేనిపోని మాట

లను హితవులని చెప్పుటకు వచ్చుచున్నాఁ డేమోయని యటు వైపు నిజదృష్టుల సారించి చూచి కపటవటువు భుజగభూష ణుఁ డగుటం గాంచె.

—: మాయావటువు నిజరూపమును దాల్చుట :—

"శా. సాక్షాత్కారముఁ జెందెనప్పుడు గిరీశానుండు ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమ నిర్భరకటాక్షాలోకనప్రోక్షితన్
వీక్షించెన్ దరళాక్షియున్ మనమున స్త్రీవ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింపసిలిచెం దత్సన్నిధానంబునన్."

అటుల ప్రత్యక్షమై "పర్వతరాజనందనా! నీఘోర తపంబునకు నే మెచ్చితిని. నీవు తపం బనుశుల్కము నిచ్చి ననుఁ గొంటివి. నే నిదిమొదలు నీ వాఁడను. నన్నిఁక నీ వేలుకొనుము" అని సప్రేమంబుగఁ బల్కుచుండ నుమయు నాఁటికి నిజతపఃఫలము పండిన దని యెంచుచు వినయలజ్జా భరంబులు దోఁప మునివేషమును సర్వమును వీడి మనంబునఁ బరితోషించుచు జయవిజయలను గూడి భవునిమ్రోల నిలిచి "దేవా! నేఁటికి నాతపము, జన్మమును సార్థకము లైనవి. నీ కోరినయట్లు నేను నినుఁ బరిణయమాడ నస్వతంత్రురా లను. దేవరకు మాజనకుండు హిమవంతుం డగ్నిసాక్షిగ నన్ను సమర్పింప దక్షుండు. కన్యకను విశేషించి పితృపరతం త్రురాలను నగు నాయెడ సదయుండ వగుచు భవదాజ్ఞో

ల్లంఘన మాచరించినందులకై మనంబున నావంతయుఁ గినుకఁ జెందక నావంతను మాన్ప నవధరింపవలయు" అని చెప్ప నభవుఁ డౌఁ గాక యనుచుఁ బలికి యగజను వీడుకొలిపి తానును నిజనివాసంబున కేగి దివ్యచిత్తంబున సప్తర్షులను దలంచె. పార్వతియుఁ దనకు దర్శన మిచ్చి తప్పక వివాహమాడెద నని యభయం బిచ్చి యేగినశివునిఁ బొగడుచు జయవిజయలం గలిసి యోషధీప్రస్థమునకుఁ బోయి సర్వవృత్తమును జనకులకు సవినయంబుగ విన్నవించె. మేనకాగిరిరాజులు నిజసుతావిజయమున కెంతయు నానందించుచుండిరి. చపల లగుట జయవిజయలు తాము కన్న పార్వతీవృత్తమును బూర్తిగఁ బాపగుర్రిచ్చినరీతిఁ బట్టణపుఁబూఁబోండ్లకుఁ జెప్పిరి. ఆవార్త కర్ణాకర్ణికగఁ బట్టణమం దంతటను వ్యాపించినది.

# అయిదవ ప్రకరణము.



## —: సప్తర్షులు శివుని దర్శించుట :—

తలంచినమాత్రాన సప్తర్షులు సారుంధతీకులై యాకాశ మార్గమున నేతెంచి కైలాసమున దేవగణపరివృతుండై యుండిన నీలకంఠునిమోల వినమ్రులై నిలిచిరి. అంత గరళకంఠుఁడు నిజసమక్షమున నిలిచియున్న ఋషిపుంగవులఁ గరుణాదృష్టి నాదరించి వారిచెంత నిలువంబడి యున్నమాననీయ చరిత యగు నరుంధతిని గౌరవంబున భేదంబు లేకుండ నాదరించె. మఱియు నంధకరిపునకు ఋషులఁ జూచినమాత్రాన దారపరిగ్రహబుద్ధి యుదయించె. దారపరిగ్రహమే కదా సకలధర్మసాధన హేతువు?

"ఉ. పర్వతసార్వభౌముసుత। పై ననురాగము సంప్రహర్షమై
శర్వునిచిత్తవృత్తి కొన। సాగుచు నుండుట కానవచ్చుటం
బూర్వపుఁ దప్పుఁ జేసి వెఱఁ। బొందుచు నున్నయనంగుఁ డెంతయున్
నిర్వృతిఁ జెందె నాఁదనము। నీతిఫలించి తపంబు పండినన్"

"అప్పుడు సప్తర్షులు హర్షవినయభక్తిశ్రద్ధావిశ్వాస తాత్పర్యంబులు మనంబునఁ బెనంగొనంగఁ గేలుదోయి మొగిచి ఫాలభాగంబునం గీలించి కంటకితకపోలభాగులై దేవా!

యింతకాలంబునకుం గదా మాతపోదానాధ్యయనయజ్ఞవ్రతాదిధర్మంబులు ఫలియించె. భువనాధ్యక్షుండ వైన నీవు మనోరథాగోచరం బైనమన్ననం జేసి మనోవిషయంబున మన్నించితివి. ఇంతకంటెను భాగ్యంబు గలదే? ఎవ్వానిచిత్తంబున నీవు వర్తింతువో వాఁడు కృతార్థుండు గదా? నీచిత్తంబున వర్తించు మాకృతార్థత్వంబు వేఱ వర్ణింప నేల? భవత్స్వంభావనా విశేషంబున యంద మాకు బహుమానంబు ప్రత్యయంబు నయ్యె. యుష్మదను ధ్యానసంభవంబగుప్రమోదభారంబు మాయంతరంగంబుల యందంగీకరించుటకు సకల భూతాంతర్యామి వగు నీవ ప్రమాణంబు. మాటలు వేయు నేటికి? చింతితోపస్థితుల మైన మమ్ము నేపనిపంపునఁ దలంచితివో యానతి మ్మనుట యుఁ” జంద్రశేఖరుఁడు వారలం గాంచి వార్షికాబ్దధ్వని నను కరించుచు “మహానులారా! నాహృదయవృత్తి మీకు విదిత మైయుండ నోపు. దేవతలు చిరకాలమునుండి పరిక్షీణవిభవులై మత్సంతతిని సేనానిఁగాఁ గోరుచున్నవారు. పాపము! వారిపు డనన్యగతికులై నాసుతోదయంబు నహరహంబును పిపాసాముఖరితుండు శీతలోదకంబును గోరువిధంబునఁ గోరుచున్నవారు. మఱియు విదితజన్మాంతరవృత్త యగుపర్వతరాజతనయ కానలంబడి యనన్యసాధారణం బగుతపంబును నిరాహారయై సముపార్జించి నన్ను వశ్యునిగఁ జేసికొనినది.

"ఏతదర్థంబ పార్వతిని ధర్మపత్నిఁగా నపేక్షించుచున్నవాఁడ. మాకొఱకు మీరు హిమాచలంబునకుఁ బోయి యక్కార్యంబు సంఘటింపవలయు. యుష్మత్సంఘటితంబులైనసంబంధంబుల కెన్నండును వికారంబు పుట్టనేరదు. అభ్యున్నతుండును, స్థితిమంతుఁడును, వసుంధరా భారధూర్వహుండును నగు నద్ధరాధరసార్వభౌముండు సంబాధబాంధవార్హుండు. కన్యార్థంబ యిటు ప్రవర్తింపుఁడు. భవత్ప్రణిహితంబులైన పురాణాగమాదులు గదా లోకవ్యవహారములకు నిదర్శనంబులై యుండు. నీయరుంధతీదేవియు నీకార్యంబునకు సహాయ కాఁగలదు. విశేషించి వివాహశోభనకార్యంబుల యందుఁ బురంధ్రీజనంబులకుఁ జనవు చెల్లు. ఇది శుభముహూర్తంబు. ఇప్పుడు గదలి యోషధిప్రస్థపురంబునకుం జనుండు. కైలాససానుప్రదేశంబులఁ బునస్సమాగమం బగుఁగాతమని శంభుఁడు విస్రంభగంభీరంబుగ నానతి యిచ్చిన" సురమునులును గిరిజాపాణిగ్రహణకుతూహలురై యిందుశేఖరుఁ డుండ నాఁడు మొదలు నిజహృదయంబులఁ బరిగ్రహవ్యతికరసంభవం బగులజ్జను బరిత్యజించుచు దేవదేవు నుద్దేశించి "దేవా! తప్పక నీయాజ్ఞను శిరసావహించి యిప్పుడ గిరిరాజును సందర్శించి యిక్కార్యమును సాధింతుము. ఇందులకేమియు సందియము లేదు. భవదాజ్ఞాపాలనముకంటెఁ బురుషార్థ మింకొకటి మా కున్నదే" యనుచు నాతనిచరణరాజీ

వంబులకు నతు లిడి యరుంధతీసహితులై హిమవంతంబునకు క్షణమాత్రంబున నేగిరి.

—: గిరిరాజు మునుల సత్కరించుట. :—

సప్తర్షులును దన్నుఁ జూడ నేతెంచుటఁ దెలిసికొని ధాతుతామ్రాధరుఁడును దేవదారుభుజుఁడును సానువక్షస్థలుఁడును వటస్కంధుఁడును నగు మంచుగుబ్బలిరాజు ససంభ్రమహృదయుఁడై మేఘాకృతులై యాకసమునుండి డిగ్గిన మునుల కెదు రేగి విధివిధానంబుగ నర్ఘ్యాదివిధుల సత్కరించి నిర్మలాచారసంపన్ను లగు నమ్మునితల్లజుల నంతిపురికిఁ గొంపోయి క్రమంబుగ నుచితాసనాసీనులం జేసి మార్గశ్రమంబు వాయ నల్లనల్లన వీవనల వీచుచుఁ గొంత తడివారు విశ్రమించిన పిమ్మట వినమ్రుఁడును ముకుళితాంజలియు నై వారల నుద్దేశించి "మహానిచంద్రులారా! కోరనికోరికగాఁ దాము నాయెడ సదయులై యేతెంచుటం జేసి నే నెంతయుఁ గృతకృత్యుఁడ నైతిని. భవత్పాదరజము నాయందుఁ బడుటం జేసియు నభ్రగంగ నాశిరమునుండి పాఱుటం జేసియుఁ బవిత్రుఁడ నైతిని. స్థావర మైన నామేను భవత్పాదకంజస్పర్శంబునఁ బవిత్ర మయ్యె. మిమ్ముసందర్శించుటచే నాకన్నులును సార్థకము లైనవి. భవత్కరుణారసంబు నాపై వర్షించుటం జేసి నా నెమ్మనము సంతుష్టిఁ జెందె. భవద్దివ్యతేజమునఁ బడి నామనమునఁ గల తహతహ గరఁగిపోయినది. వేయేల? తాపసోత్తములారా!

తాము ననుఁ గృతార్థునిఁజేయుటకును బవిత్రునిఁ జేయుటకు ను బరమపుణ్యునిఁ జేయుటకును సంపన్నునిఁ జేయుటకును దలఁచి యేతెంచితిరి గాని వేఱుగలదే? మఱియు నార్యులారా! మిమ్మిటకు రావించిన కార్యగౌరవం బెద్దియో తెలిపిన నా యోపినకొలఁది దేవరకార్యమును సాధించి ముదం బందెద న నుచు గంభీరంబుగను సగర్వంబుగను గిరికందరకాననంబులు ప్రతిధ్వను లిచ్చునట్లుగను బల్కెను.

—: తాపసులు తాము వచ్చిన కార్యమును :—

గిరిరాజునకుఁ జెప్పుట.

మునులు తమ్ము యథావిధిగ సమ్మానించిన గిరిరాజు ధైర్యసాహసాదులకును వినయమునకును సంపదకును నచ్చె రువందుచుఁ జిత్తరపుబొమ్మలమాడ్కిఁ జూచుచుండిరి. అం త నొక కొంతసేపునకు మునుల యనుమతి నాగిరోముని గిరి రాజును జూచి యిట్లనియె. "రాజా! నీసపర్య కెంతయు నానం దించితిమి. నీకు సర్వశుభంబులును సిద్ధించును.

"చరాచరభూతజాలంబునకు నాథాయుం డవగు నిన్నుం బురాణబ్రహ్మాదులు విష్ణుం డని స్తుతింతురు. సప్తపాతాళ భవనగోళమూలాధారంబ వగు నీవు భూభువనంబును భరి యింపనినాఁడు భుజంగమశేఖరుండు మృణాళపేశలం బగు ఫణామండలంబున నిడి భరింప సమర్థుం డగునే? సత్పావనం

బులును నాసేతుసము ద్రావనీ చిహ్నంబులును నగు నీసలిల ప్రవాహంబులు భవత్కీర్తితీర్థంబులుంబోలె భువన పావనంబులు తిర్యగూర్ధ్వాధరస్థానంబు లాక్రమించి త్రివిక్రమావతారంబున విరాడ్రూపంబు వహించినవిష్వక్సేను ననుకరించెదవు. నీకు నితరపర్వతంబులకును సాటియే. ఇది యిట్లుండనిమ్ము. మేము వచ్చినకార్యంబు సావధానుండవై యాకర్ణింపుము.'' ఏమహామహుండు సుధాధామునకో వేల్పులకుం గూడలేని యైశ్వర్యశబ్దమును వహించెనో, ఏమహామహుం డవనప్రధానంబులైన యాగంబుల సకలజగము సవరించునో, యోగివర్యులు నిశ్చలహృదయంబున యోగదృష్టి నెవ్వానిం గాంతురో, సూక్ష్మదృష్టిని బుధు లేవానిపదము శాశ్వతమందురో, ఆశంభుండు- ఆ సకలలోకైకసాక్షి నీయనుంగుకూంతును దనకు ధర్మపత్నిగా నిమ్మని మమ్ముల నడుగం బుత్తెంచినాండు. మీయిరువురకును మేము పెండ్లి పెద్దలము. నేంటికి నీవు భాగ్యవంతుండ వైతివి. ఈలోకత్రయంబునకును జాద్రనమాత్రి తండ్రి. నీసుత తల్లియాంగాక! అమరులు ముందుగ హారునకు మ్రొక్కి యనంతరమీయమకు మ్రొక్కులిడుదురు. నీకూంతు నిచ్చి హితబాంధవమున సర్వజ్ఞునకు గురుండవుదువు. ఈచంద్రాననమూలముగ నద్రికులమును దేవకులమును గలియుంగాక. గిరిరాజా! జనకులకుం దగినవరునకుం గన్యాదానమిచ్చుకంటె లోకంబున నొందు ఘనకృత్యం బెద్దియో

నం గలదే? యుక్తవరాన్వేషణాప్రయాసమానంతయు లేకయే నీ కీసర్వజ్ఞుం డల్లుం డయ్యెదనని వార్త నంపినాఁడు. ఇచ్చువాఁడవు నీవు. దానప్రతిగృహీత త్రిలోకేశుండగు నాఫాలలోచనుఁడు. కన్యయన్ననో! యోగిజనవందనీయ యగు నుమాకన్య. ఇఁక సంధాతలము మేము. ఇట్టిసంబంధమునకు నీవు వెనుదీయక యంగీకరింపుము." అని ఋషులు నిజపరిణయంబునకై గిరిరాజుతో నుచితంపురీతిని సంభాషించుచుండఁ నాయుమాకన్య తండ్రిచెంతఁ జేరి లజ్జయు సౌఖ్యంబును ముదంబును దోఁప నమ్రవదనయై యల్లనల్లనఁ బాదాంగుళిని నేల వ్రాయుచుఁ బాణిపద్మంబునఁ బద్మపత్రంబుల లెక్కించు చుండె. అంత గిరిరాజు వివాహకార్యముల స్త్రీలకుఁ జనవిచ్చుట సంప్రదాయసిద్ధం బౌట మేనకాదేవిమోము నంగీకారసూచకంబుగఁ జూచి యామెకనుసన్న సర్వంబును గ్రహించి సంపూర్ణకాముండై యనుంగుకూఁతు నుద్దేశించి "అమ్మా! సకలలోకశరణ్యుం డగుచంద్రమౌళికి నీవు భిక్షవైతివి. నీతంబును బాడె. ఘనతరపుణ్యరాసులును నాదిమబ్రహ్మలును నగుగగనమును లర్థులై వచ్చినారు. అనవరతపతిపదధ్యానాసక్త యగునరుంధతీదేవియు నిక్కార్యంబునకై యేతెంచె. నీకారణంబున సకలభాగ్యంబులును గృహమేధిఫలమును మాకు సిద్ధించినవి." అనుచు ఋషులకును నరుంధతీదేవికిని మ్రొక్కించి "ఆర్యులారా! ఈకన్య నాసుత. శివునియర్ధాంగ

లక్ష్మి. ఈమోహప్రీణతుల ననధరింపుఁడు." అనుచు నొదిఁగి యుండ గగనమునులు పార్వతినాశీర్వదించి కార్యము సిద్ధించి నందుల కెంతయు నానందించిరి. అంతఁ దనకోరినవరుఁడు ల భించుటచే నమితానందమున నోలలాడు పార్వతీకన్య నరుంధ తి నిజాంకపీఠం గూర్చుండఁబెట్టుకొని ప్రియపూర్వకముగ ను పలాలించె. మునులందఱు గిరిరాజును జూచి "గిరిరాజా! నేఁ టికి వివాహవిధి నాలవనాఁ'డని ముహూర్తనిశ్చయముఁ గావిం చి హిమవంతు నాదరించి యరుంధతితోఁ గైలాసంబున కేగిరి. శివుఁడు త్వరమాణహృదయుండై మునులరాకఁ జూచుచు నిజ సాన్నిధ్యమున కేతెంచినవారిం గాంచి సర్వంబును దెలిసికొని మునులం బంప వారును స్వస్థానంబుల కేగిరి. పశుపతియు నె ట్టకో దినంబుల గడుపుచుండె.



# ౨౦వ ప్రకరణము.



## వివాహయత్నములు.

ఓషధీప్రస్థమునందలి జనులందఱును జయవిజయుల వలన సర్వంబు నాలించియుఁ దమకోఁ దా పూఁగాదని యేమేమో యనుకొనుచు సప్తర్షులయాగమనమున సర్వంబును నిశ్చయ మని విని తమరాజపుత్రికావివాహంబున కెంతయు ముఱియుచుఁ బురంబు నలంకరింపఁజొచ్చిరి. హిమవంతుఁడు ఋషులను బంపి తాను వివాహాలగ్న మాసన్నమగుటఁ దగుయత్నములఁ గావింపఁ దలఁచు నవియుఁ బురం బలంకరింపవల యునని తలంచి యుండవలయు నలంకరణము లన్నియు నీశ్వరప్రభావంబునను బురజనులసామర్థ్యంబునను నేకొఱఁతయు లేకుండ నమరినవి. మఱియుఁ బురమం దంతటను గలయంపి చల్లి ముత్యాలరంగవల్లులను బెట్టి రంభాస్తంభంబులను, మణితోరణంబులను, చీనిచీనాంశుక వితానంబులను గట్టించి సకలసామగ్రియు వివాహదిదృక్షు నేతెంచిన జనులకుఁ గొఱఁత లేకుండ నుచితంబుగ నిచ్చునట్టుల సకలవిధుల నాపణకంబుల నమర్చి సకలజనులును దమంతటఁదామే రాజును సందర్శించి "దేవా! సర్వంబును సిద్ధం బైనది. ఇంకను మాచేయు కార్యంబుల నానతిచ్చితేని యిప్పుడ చేయువారమనుచుఁ" జె

ప్పిరి. దానిం గాంచి గిరిరాజు ద్విగుణీకృతోత్సాహుండై యా నాఁటియుదయంబునఁ బురం బలంకరింపఁబడుటకును సకలసామగ్రియు సిద్ధంబగుటకును నిజపరివార మంతయు నేకగ్రీవముగఁ దనకనుకూలంబుగ నుండుటకెంతయు నానందించి పరివారంబును యథావిధిగ బుజ్జగించి తగు కార్యంబుల నప్రమత్తులై యుండ నియోగించె. అట్లు స్వామియాజ్ఞ నొందలఁ దాల్చి జనులందఱును సుముహూర్తమునకై వేచియుండిరి. అప్పు డోషధిప్రస్థపురము సకలము నొకయిలువోలె నుండె.

—:పార్వతి కల్యాణమంటపమున కేతెంచుట:—

అంతఁ బేరటాండ్రు కొందఱు వివాహకాల మాసన్న మగుట మైత్రీముహూర్తంబున నుత్తరఫల్గునీనక్షత్రమునకుఁ జంద్రయోగము గలుగుచుండ నుమాకన్య నలంకరించిరి మఱికొందఱుసువాసినులాకన్యకామణి కభ్యంగస్నానముం జేయించి నీరార్చి కురులచిక్కు విప్పుచుండిరి. ఇంకను ననఁబోఁడి యొకర్తు పూలమాలలం దుఱుముచుండె. మఱియొర్తు రత్నాభరణంబుల దిద్దుచుండె. ఇంకొకతె పరిమళద్రవ్యంబుల నలఁదుచుఁ జరణరాజీవంబులకు లత్తుక హత్తించె. ఒకసరసిజాక్షి చరణపల్లవంబుల ఫాలలోచనుని కిరీటబాలేందుని ముట్టు మనుచును మఱియొకశాతోదరి శివుని యర్ధశరీరమును గైకొను మనుచును వేరొండుమత్తకాశిని

త్వరలోఁ దారకునిసంహరించు పుత్త్రునిఁ గనుమనుచును దీవించిరి. అంత నోర్తుక మంగళార్థంబుగ నామెకన్నులకుఁ గాలాంజనము రచియించె. "అప్పుడు కుసుమంబులతోడ లత యును, నక్షత్రగ్రహతారకంబులతోడ రాత్రియును, గల హంససందోహంబుతోడ మందాకినియుం బోలె దివ్యాభర ణంబులతోడం గూడి పార్వతి సర్వలోకనయనోత్సవకర యయ్యె. అయ్యవసరంబున" మేనక యేతెంచి స్వయముగ నవా లంకారముల నుమాకాంత నలంకరించి మోమునఁ గల్యాణ తిలకరేఖను దిద్దె. సకలంబును సిద్ధం బయ్యెననియుఁ బార్వతి సంపూర్ణమనోరథ యయ్యె ననియు నెంచి యామెహస్తం బునకు కౌతుకహస్తసూత్రమును బంధించి స్త్రీ యపాట నిం చుక వివర్ణవదనయై భాష్పాకులలోచన యయ్యె. అప్పుడు మాకాంత శరత్కాలచంద్రికాధవళం బగుపట్టువస్త్రమును ధరించి కులదేవతలకును ముత్తైదువలకును గులాగతధర్మము ననుసరించి మ్రొక్కి వారి యాశీస్సుల నందుకొనుచు మంద మందగమనంబున నొయ్యారంబు మీఱ సఖీజనపరివృతయై కల్యాణమంటపమున కేతెంచి యందలి రత్నఖచితసింహాసనం బున నాసీనయై యుండి పశుపతియాగమనమునకై ప్రతీ క్షించుచుండె.

—: శివుఁడోషధిప్రస్థమున కేతెంచుట :—

పార్వతీకరగ్రహణత్వరమాణహృదయుండై దినంబులు యుగంబులమాడ్కిఁ గడపుచు వివాహసమయ మాసన్నమగుడు తన్ను సప్తమాతృకలు నలంకరింప నాదికాలమునాఁడు సతిని బెండ్లియాడునపు డెట్లు శృంగారింపఁబడెనో యట్లనే యిపుడును గైసేసికొని ముదంబునఁ బ్రయాణసన్నద్ధుండై యుండె.

"సీ. భసితంబు కర్పూర పాళి కస్తూరికా
భరితాంగరాగసంపద వహించె
పచ్చియేనుఁగుతోలు పసిఁడికమ్ములపట్టు
పచ్చడం బనెడివిభ్రమము దాల్చె
భుజమధ్యమునఁ గ్రాలు భోగిభోగంబులు
తారహారములచందంబు నొందె
వేగుఁజుక్కఁ జిననికంటి చిగురుచాయలతీరు
సిందూరతిలకంబు చెలువు సించె
దివమునందును వెన్నెల దీటుకొనఁగ
శైశవంబున విగతలాంఛనతఁ జెంది
చాల నొప్పారు సుకుమార చంద్రరేఖ
తనకుఁ దాన చూడామణిత్వము వహించె."

"ఇవ్విధంబున గంగాధరుండు సమాసన్నగణాపనీతంబైనఖడ్గంబున నీడఁ జూచి నందిభుజావలంబియై శార్దూల

చర్మవిహితపల్యాణబంధం బగు వృషభంబును కైలాసశిఖరంబుం బోలె నారోహణంబు సేసి బ్రాహ్మి మొదలైన మాతృకలును గపాలాభరణయైన భద్రకాళియు భృంగిరిటనికుంభధరభద్రకాళప్రముఖప్రమథపరివారంబును బరివేష్టింప భూతభేతాళశాకినీఢాకినీగణంబులు మంగళతూర్యనాదంబులు మురాయింపం ద్వాత్రింశత్కోటిదేవతాసమూహంబులు గొలువ సహస్రరశ్మి ధవళాతపత్రంబు ధరియింప గంగాయమునలు వింజామర లిడ నుభయపార్శ్వంబుల నిజవాహనారూఢులై హరివిధాతలు వేత్రహస్తులై తలంగుండు పాయందొలంగుం డనుచు సందడి నెడం గలుగం జేయంగల హాశనతుంబురులును విశ్వావసులును హా హా హూహూవ్రలును త్రిపురవిజయాదివిద్యాధరులును త్రిపురవిజయాదికము లుగ్గడించుచుండ సప్తర్షు లరుంధతీసహితంబుగా మంగళద్రవ్యంబులు సంతరించుకొని నడువ నాకాశమార్గంబునం జామీకరకింకిణీక్వాణంబులు సెలంగ ముహూర్తకాలంబునకు నగేంద్రగుప్తం బగు నోషధిప్రస్థపురంబునకుం జని తదీయోపకంఠంబున డిగ్గిన"

—: నగరాజు శివు నెదుర్కొనుట :—

నిజపురోపకంఠంబున విడిసియుండిన శివు నెదుర్కొనుటకై గిరిరాజు సకలజనులును గిరిపంక్తియుఁ దోడురా మంగళధ్వనులు నలుదెసల వ్యాపింప వనగజశ్రేష్ఠము నెక్కి మనంబున ఘనంబుగ ముదం బందుచు నాతని సమీపించి యుచిత

మర్యాదలు జరిపించి పురప్రవేశంబు గావించె. అప్పుడు పురంధ్రిలలామలు సౌధవీథుల వ్యాపారాంతరశూన్యలై నిలిచి చిరకాల మడవుల నిడుములం గుడిచి తప మాచరించి పార్వతీకాంత సముపార్జించిన వరుఁ డెట్టివాఁడో యని చూచుచుండిరి. మహోక్షంబు వృద్ధత్వంబున నుండియు నానందమున నొడలు మఱచి నిండుజవ్వనమునఁ దులఁదూఁగు వృషభంబుమాడ్కి వాయువేగమనోవేగముల ధిక్కరించుజవంబున నోషధీప్రస్థపురమును బ్రవేశించె. సౌధవీథుల నిలిచియుండిన నవఁబోండ్లందఱును వృషభవాహనారూఢుఁడై యేగుచుండిన రుద్రునిం గాంచి తమలోఁ దాము పార్వతితపము పండిన దనియు, నగరాజు నేఁటికి భాగ్యవంతుం డయ్యె ననియు మేనకాదేవియు సర్వజ్ఞుం డల్లుండగుటంబట్టి పుణ్యవతియు సత్సంతానవతియు భాగ్యవతియు నయ్యె ననియు ననుచు నీశ్వరప్రభావమును సౌందర్యమును వేనోళ్ళఁ బొగడుచు నిర్నిమేషంబుగ నీశ్వరుం జూచుచు నొడలు మఱచి యథాపూర్వముగఁ జిత్రప్రతిమలవలె నిలిచియుండిరి.

## —: ఉమానీలకంఠుల వివాహము :—

తుషారగిరీశ్వరుండు యథావిభవంబుగఁ గైలాసాధిపతిని పురప్రవేశము గావించి వివాహవేదికామధ్యంబున నాసీనుం గావించి పితామహుండు బ్రహ్మాసనంబున నధివసించి వేదచోదితమంత్రంబులఁ జదువుచుండ మంగళధ్వనులు చెల

రేఁగ మేనకాదేవి పసిఁడికలశంబుల జలంబులు వోయ సురాసురకిరీటమణిరంజితంబు లగు పురాసురాంతకుని పదకంజంబులం గడిగి తత్పాదశౌచవారి శిరంబునం జల్లుకొని సాలంకృతంబుగఁ గన్యాదానం బొనరించె. అప్పు డరుంధతీయుతు లగుసప్తర్షులు మంగళాశీర్వాదంబులఁ జేయుచుండఁ జిరకాలవిరహదందహ్యమానమానసు లగు పార్వతీపరమేశ్వరులు మనోరథసిద్ధిం బడసి నిర్వర్తితపాణిగ్రహణమహోత్సవులై భక్తిపూర్వకంబుగఁ బితామహునకుఁ బ్రణమిల్లిరి. మఱియుఁ జతురంతవేదికామధ్యాధ్యాసీనులై యుమానీలకంఠులు లౌకికం బగునార్ద్రాక్షతారోపణం బనుభవించి నిరుపమానతేజోవిరాజితులై యుండిరి.

సీ. అమృతబిందువులు పై । నందందుఁ జిలుకంగఁ
బద్మాతపత్రంబు । బట్టెఁ గమల
కల్యాణసమయార్హ । గద్యపద్యంబులఁ
గైవార మొనరింపఁ । గడగె వాణి
రంభోర్వశీముఖ్య । జంభారి వనితాళి
తూర్యత్రయంబునఁ । దోడుసూపె
మందాకినియును గా । ళిందియు నిలుచక్కి
రమణఁ బై వింజామ । రంబు లిడిరి
వేళ యెఱిఁగి మహేంద్రాది । విబుధగణము
ముకుటముల హస్తపల్లవ । ముల ఘటించి

వేఁడుకొనిరి మహాదేవు వినతు లగుచుఁ
జిత్తసంభవునకుఁ బున ర్జీవనంబు."

అప్పుడు మహేశ్వరుఁడు సంబంధబాంధవమువలనఁ గలిగినయనురాగంబున గిరిరాజును గృతార్థునిఁ గావించి పూర్వపువైభవంబును మించువైభవంబున నలరారునటుల మనసిజునిఁ గావించి రతీవిరహమును బాఱఁదోలి నిజవివాహదిదృక్షువులై యేతెంచిన దేవగణంబుల సకలవిధంబుల గారవించి యనిపి ప్రమథవర్గమును శాకినీఢాకినీవితతిని యథోచితంబుగ నాదరించి యనిపి తాను గిరిజాసహితుఁడై సాలంకారం బగురత్నగేహంబును బ్రవేశించె.

—: హిమవంతుని యానందము :—

గిరిరాజు సఫలమనోరథుఁడై యుమానీలకంఠుల వివాహమును జూడ నేతెంచినజనుల కేకొఱఁతయు లేకుండ సకలవిధంబుల భోజనంబుల దానదక్షిణల సంతృప్తులఁ గావించి గిరివర్గంబును యథావిభవంబుగ నుపదానంబుల నొసంగి యనిపిపుచ్చె. మఱియు దేవగణంబులను గిన్నరప్రభృతులను సంతోషపూర్వంబుగ నాదరించి వారివారి సదనంబుల కనిపిపుచ్చె. అరుంధతీదేవితో సప్తర్షులును విశేషంబుగ మేనకాగిరిరాజులను బ్రస్తుతించి యమోఘాశీర్వాదంబులఁ గావించుచు స్వనిలయంబులకుఁ బోయిరి. సకలకార్యంబులును నిర్విఘ్నంబుగఁ గొనసాగుటం జేసి యానగాధిరాజు మితిలేని యా

నందంబు నందుచు సర్వజ్ఞుని జేపట్టిన సుతయు నగారివజ్రపాతంబునకు లోనుగాక స్వప్రతిష్ఠను నిలుపుకొనిన మైనాకుం డనుసుతుండును గలుగుటం జేసి తాను సత్సంతానవంతుం డనుచును మాననీయుం డనుచును సకలలోకంబు పొగడుచుండ సగర్వుండై యుండె.

## —: కుమార జననము :—

పార్వతీపరమేశ్వరుల వివాహానంతరమున యథాగౌరవంబుగ నాదరింపఁబడిన యింద్రాదులు గౌరీశంకరుల యభివృద్ధిని సుతోదయంబును గాంక్షించుచుఁ గుమారుం డుదయించినతోడనే సైన్యాధిపత్యము నాతని కొసంగెద మనియు నేపాని యగుకుమారుండు తారకుని వధించుననియుం దా మందువలన నేలోపంబులు లేకుండ హవిర్భాగంబుల నందుకొనుచు సుఖంబుగ వియద్గంగయందు స్నాన మాడవచ్చునని యు నాఁటితోఁ దమయిక్కట్టులు కడతేఱిన వనియు నెంచుచు ముదం బందుచుండిరి.

అంత నట నీలకంఠుఁడు పార్వతివలన సకలసౌఖ్యంబులనవ్వారిగ ననుభవించుచు నామెను బలువిధంబుల నానందింపఁ జేయుచుండె. కొంతకాలమున కామెగర్భవతియై ప్రొద్దులునిండ నొకనాఁడు శుభముహూర్తంబున దివ్యలక్షణలక్షితుం డగుకుమారుండు జన్మింప నాతని కాంబికేయుఁ డని నామంబు నిడి హరుడు పరితోషించుచుండె. పార్వతియుఁ దనకు సుతోదయం బగుట ద్విగుణీకృతోత్సాహినియై యాత

నిం గారాబంబుగఁ బెంచుచుఁ దారకునిఁ జంపి దేవహితముం జేయుమనుచు దీవించుచుండె. కుమారుండు నానాశైశవక్రీడల నానందించుచు దినదినప్రవర్ధమానుండై శైశవంబు నతిక్రమించి యౌవనప్రాదుర్భావుం డయ్యె.

—: కుమారునకు సేనాధిపత్యము నొసంగుట :—

ఇంద్రాదులు కుమారుని పరంపరాభివృద్ధినిఁ గాంచి యమితానందంబు నందుచు బృహస్పతిపురస్కృతులై మహేశ్వరుని సందర్శించి "దేవదేవా! మమ్ములఁ దారకుం డను రాక్షసుండు బలువెతలం బెట్టుచున్నవాఁడు. వానివలన మేము పడుచున్న బాధలఁ జెప్ప వలంతులము కాము. వాఁడు బ్రహ్మవరలబ్ధగర్వంబునఁ గ్రిందుమీఁదు గానక యెటఁజూచినఁ దానయై చెలరేఁగుచున్నవాఁడు. అలనాఁడు బ్రహ్మ మా మొఱలాలించి మీకుమారుండు వానిని సంహరించు నని యానతిచ్చె. అటనుండియు మేము పలువెతలం గుందుచు భవత్పుత్రోదయంబు నాకాంక్షించుచు నెటెటో ప్రాణంబుల నిలిపికొనినారము. నేఁటికి మానోము లన్నియును ఫలించినవి. మాకష్టంబులును గట్టెక్కినవి. దేవర యనుగ్రహించి భవత్కుమారుని సేనానిగఁ జేసితి రేని మామనోరథం బీడేరు" ననుచు దీనాతిదీనులై మొఱలిడిరి. వారి మొఱ లాలించి యాశ్రితావనతత్పరుఁ డగుగిరిజాజాని నిజకుమారుం బిలిచి "కుమారా! యింద్రాదిదేవతలు సేనాని లేమిం జేసి మిగులఁ జింతిల్లుచు

న్నారు. మఱియు నదికారణంబుగఁ దారకుండను కూ్రిరరాక్ష సుఁడు వీరిని బలువిధంబులఁ జెఱచుచున్నాఁడు. కావున నీవు దేవసేనానివై యుపాయంబునఁ దారకుని వధించి యింద్రా దులకు శుభం బొనఁగూర్పు మనుచు నాతనికి దేవసేనాధిప త్యము నొసంగి యింద్రాదులకు స్వనివాసంబులకుఁ బో సెల వొసంగె. ఉమయు దేవసేనాధిపత్యమును వహించినకుమా రుం గాంచి "నాయనా! నీ వచిరకాలంబుననే తారకజేతవ్రు గమ్ము" అనుచు దీవించి యింద్రాదులకు సెల వొసంగె.

—: తారకవధ :—

ఇంద్రాదులు భవానీభర్గులసెలవుల నంది కుమారుం దోడ్కొనిపోయి తారకుండు గావించినదుండగములను వాని పరిభావంబును వానియునికియుఁ దాము గావించినయత్నం బులును మొదలుగా సర్వంబును విన్నవించి యాతనిసాయం బునఁ దారకవధకు వలయుయత్నములం గావించుచుండిరి. కుమారుఁడు దేవవరులవలనఁ దారకునివృత్తమును బూర్తిగ నాలించి తత్సంహారణోపాయంబు నాలోచించుచు దేవలోకం బునఁ గలవింతలను జూచుచుండె. తన కప్పటికి కాలము స మీపించుఁడు తారకుఁడు నిజసహచరులవలనఁ గుమారజన నాదికమును దెలిసికొని వారలం గాంచి "సహచరులారా! నిన్న మొన్న పుట్టి మాయ యన నేమో యెఱుంగక యుండి నకుమారుఁడా ననుఁ జంపువాఁడు? నే నజేయత్వమును బ్రబ హ్మను మెప్పించి పొందినవాఁడను గదా? ఆబ్రహ్మయైనను

—: శివుఁడు ఓషధిప్రస్థమునకేతెంచుట :—

పార్వతీకరగ్రహణాత్వరమాణహృదయుండై దినంబులు యుగంబులమాడ్కిఁ గడపుచు వివాహసమయ మాసన్నమగుడు తన్ను సప్తమాతృకలు నలంకరింప నాదికాలమునాఁడు సతిని బెండ్లియాడునపు డెట్లు శృంగారింపఁబడెనో యట్లనే యిపుడును గైసేసికొని ముదంబునఁ బ్రయాణసన్నద్ధుండై యుండె.

"సీ. భసితంబు కర్పూర। పాళి కస్తూరికా
భరితాంగరాగసం।పద వహించె
పచ్చియేనుఁగుతోలు । పసిఁడికమ్ములపట్టు
పచ్చడం బనెడివి।భ్రమము దాల్చె
భుజమధ్యమునఁ గ్రాలు।భోగిభోగంబులు
తారహారములచం।దంబు నొందె
జేగుఱించినకంటి । చిగురుచాయలతీరు
సిందూరతిలకంబు।చెలువు నించె
దివమునందును వెన్నెల । దీటుకొనఁగ
శైశవంబున విగతలాం।ఛనతఁ జెంది
చాల నొప్పారు సుకుమార। చంద్రరేఖ
తనకుఁ దాన చూడామణి।త్వము వహించె."

"ఇవ్విధంబున గంగాధరుండు సమాసన్నగణోపనీతం బైనఖడ్గంబున నీడఁ జూచి నందిభుజావలంబియై శార్దూల

చర్మవిహితపల్యాణబంధం బగు వృషభంబును కైలాసశిఖ రంబుం బోలె నారోహణంబు సేసి బ్రాహ్మి మొదలైన మాతృకలును గపాలాభరణయైన భద్రకాళియు భృంగిరిటనికుంభధరభద్రకాళప్రముఖప్రమథపరివారంబునుం బరివేష్టింప భూతభేతాళశాకినీఢాకినీగణంబులు మంగళతూర్యనాదంబులు మురాయింపం ద్వాత్రింశత్కోటిదేవతాసమూహంబులు గొలువ సహస్రరశ్మి ధవళాతపత్రంబు ధరియింప గంగాయమునలు వింజామర లిడ నుభయపార్శ్వంబుల నిజవాహనారూఢులై హరివిధాతలు వేత్రహస్తులై తలంగుండు పాయుండొలంగుం డనుచు సందడి నెడఁ గలుగఁజేయఁగల హాశనతుంబురులును విశ్వావసులును హా హా హూహూప్రలును త్రిపురవిజయాదివిద్యాధరులును త్రిపురవిజయాదికము లుగ్గడించుచుండ సప్తర్షు లరుంధతీసహితంబుగా మంగళద్రవ్యంబులు సంతరించుకొని నడువ నాకాశమార్గంబునం జామీకరకింకిణీక్వాణంబులు సెలంగ ముహూర్తకాలంబునకు నగేంద్రగుప్తం బగు నోషధిప్రస్థపురంబునకుం జని తదీయోపకంఠంబున డిగ్గిన”

—: నగరాజు శివు నెదుర్కొనుట :—

నిజపురోపకంఠంబున విడిసియుండిన శివు నెదుర్కొనుటకై గిరిరాజు సకలజనులును గిరిపంక్తియుఁ దోడురా మంగళధ్వనులు నలుదెసల వ్యాపింప వనగజశ్రేష్ఠము నెక్కి మనంబున ఘనంబుగ ముదం బందుచు నాతని సమీపించి యుచిత

మర్యాదలు జరిపించి పురప్రవేశంబు గావించె. అప్పుడు పురంధ్రీలలామలు సౌధవీథుల వ్యాపారాంతరశూన్యలై నిలిచి చిరకాల మడవుల నిడుములం గుడిచి తప మాచరించి పార్వతీకాంత సముపార్జించిన వరుఁ డెట్టివాఁడో యని చూచుచుండిరి. మహోక్షంబు వృద్ధత్వంబున నుండియు నానందమున నొడలు మఱచి నిండుజవ్వనమునఁ దులఁదూఁగు వృషభంబుమాడ్కి వాయువేగమనోవేగముల ధిక్కరించుజవంబున నోషధీపస్థపురమును బ్రవేశించె. సౌధవీథుల నిలిచియుండిన నసఁబోం డ్లందఱును వృషభవాహనారూఢుఁడై యేగుచుండిన రుద్రునిం గాంచి తమలోఁ దాము పార్వతితపము పండిన దనియు, నగరాజు నేఁటికి భాగ్యవంతుం డయ్యె ననియు మేనకాదేవియు సర్వజ్ఞుం డల్లుండగుటంబట్టి పుణ్యవతియు సత్సంతానవతియు భాగ్యవతియు నయ్యె ననియు ననుచు నీశ్వరప్రభావమును సౌందర్యమును వేనోళ్ళం బొగడుచు నిర్నిమేషంబుగ నీశ్వరుం జూచుచు నొడలు మఱచి యథాపూర్వముగఁ జిత్రప్రతిమలవలె నిలిచియుండిరి.

—: ఉమానీలకంఠుల వివాహము :—

తుషారగిరీశ్వరుండు యథావిభవంబుగఁ గైలాసాధిపతిని పురప్రవేశము గావించి వివాహవేదికామధ్యంబున నాసీనుం గావించి పితామహుండు బ్రహ్మాసనంబున నధివసించి వేదచోదితమంత్రంబులఁ జదువుచుండ మంగళధ్వనులు చెల

రేఁగ మేనకాదేవి పసిఁడికలశంబుల జలంబులు వోయ సురాసురకిరీటమణిరంజితంబు లగు పురాసురాంతకుని పదకంజంబులం గడిగి తత్పాదశౌచవారి శిరంబునం జల్లుకొని సాలంకృతంబుగఁ గన్యాదానం బొనరించె. అప్పు డరుంధతీయుతు లగుసప్తర్షులు మంగళాశీర్వాదంబులఁ జేయుచుండఁ జిరకాలవిరహదందహ్యమానమానసు లగు పార్వతీపరమేశ్వరులు మనోరథసిద్ధిం బడసి నిర్వర్తితపాణిగ్రహణమహోత్సవులై భక్తిపూర్వకంబుగఁ బితామహునకుఁ బ్రణమిల్లిరి. మఱియుఁ జతురంతవేదికామధ్యాధ్యాసీనులై యుమానీలకంఠులు లౌకికం బగునార్ద్రాక్షతారోపణం బనుభవించి నిరుపమానతేజోవిరాజితులై యుండిరి.

“సీ. అమృతబిందువులు పై । నందందుఁ జిలుకంగఁ
బద్మాతపత్రంబు । బట్టెఁ గమల
కల్యాణసమయార్హ । గద్యపద్యంబులఁ
గైవార మొనరింపఁ । గడఁగె వాణి
రంభోర్వశీముఖ్య । జంభారి వనితాళి
తూర్యత్రయంబునఁ । దోడుసూపె
మందాకినియును గా । ళిందియు నిలుచక్కి
రమణఁ బై వింజామ । రంబు లిడిరి
వేళ యెఱిఁగి మహేంద్రాది । విబుధగణము
ముకుటముల హస్తపల్లవ । ముల ఘటించి

వేడుకొనిరి మహాదేవు వినతు లగుచుఁ
జిత్తసంభవునకుఁ బున ర్జీవనంబు."

అప్పుడు మహేశ్వరుఁడు సంబంధబాంధవమువలనఁ గలిగినయనురాగంబున గిరిరాజును గృతార్థునిఁ గావించి పూర్వపువైభవంబును మించువైభవంబున నలరారునటుల మనసిజునిఁ గావించి రతీవిరహమును బాఱఁదోలి నిజవివాహదిదృక్షువులై యేతెంచిన దేవగణంబుల సకలవిధంబుల గారవించి యనిపి ప్రమథవర్గమును శాకినీఢాకినీవితతిని యథోచితంబుగ నాదరించి యనిపి తాను గిరిజాసహితుఁడై సాలంకారం బగురత్నగేహంబును బ్రవేశించె.

—: హిమవంతుని యానందము :—

గిరిరాజు సఫలమనోరథుఁడై యుమానీలకంఠుల వివాహమును జూడ నేతెంచినజనుల కేకొఱంతయు లేకుండ సకలవిధంబుల భోజనంబుల దానదక్షిణల సంతృప్తులఁ గావించి గిరివర్గంబును యథావిభవంబుగ నుపదానంబుల నొసంగి యనిపిపుచ్చె. మఱియు దేవగణంబులను గిన్నరప్రభృతులను సంతోషపూర్వంబుగ నాదరించి వారివారి సదనంబుల కనిపిపుచ్చె. అరుంధతీదేవితో సప్తర్షులును విశేషంబుగ మేనకాగిరిరాజులను బ్రస్తుతించి యమోఘాశీర్వాదంబులఁ గావించుచు స్వనిలయంబులకుఁ బోయిరి. సకలకార్యంబులును నిర్విఘ్నంబుగఁ గొనసాగుటం జేసి యానగాధిరాజు మితిలేని యా-

నందంబు నందుచు సర్వజ్ఞుని జేపట్టిన సుతయు నగారివజ్రి పాత్రంబునకు లోనుగాక స్వప్రతిష్ఠను నిలుపుకొనిన మైనాకుం డనుసుతుండును గలుగుటం జేసి తాను సత్సంతానవంతుఁ డనుచును మాననీయుం డనుచును సకలలోకంబు వొగడుచుండ సగర్వుండై యుండె.

—: కుమార జననము :—

పార్వతీపరమేశ్వరుల వివాహానంతరమున యథాగౌరవంబుగ నాదరింపఁబడిన యింద్రాదులు గౌరీశంకరుల యభివృద్ధిని సుతోదయంబును గాంక్షించుచుఁ గుమారుం డుదయించినతోడనే సైన్యాధిపత్యము నాతని కొసంగెద మనియు సేనాని యగుకుమారుండు తారకుని వధించుననియుఁ దామందువలన నేలోపంబులు లేకుండ హవిర్భాగంబుల నందుకొనుచు సుఖంబుగ వియద్గంగయందు స్నాన మాడవచ్చునని యు నాఁటితోఁ దమయిక్కట్టులు కడతేఱిన వనియు నెంచుచు ముదం బందుచుండిరి.

అంత నట నీలకంఠుఁడు పార్వతివలన సకలసౌఖ్యంబులనవ్వారిగ ననుభవించుచు నామెను బలువిధంబుల నానందింపఁ జేయుచుండె. కొంతకాలమున నామెగర్భవతియై ప్రొద్దులునిండ నొకనాఁడు శుభముహూర్తంబున దివ్యలక్షణలక్షితుం డగుకుమారుండు జన్మింప నాతని కాంబికేయుఁ డని నామంబు నిడి హరుడు పరితోషించుచుండె. పార్వతియుఁ దనకు సుతోదయం బగుట ద్విగుణీకృతోత్సాహినియై యాత

నిం గారాబంబుగఁ బెంచుచుఁ దారకునిఁ జంపి దేవహితముం జేయుమనుచు దీవించుచుండె. కుమారుండు నానాశైశవక్రీడల నానందించుచు దినదినప్రవర్ధమానుండై శైశవంబు నతిక్రమించి యౌవనప్రాదుర్భావుం డయ్యె.

—: కుమారునకు సేనాధిపత్యము నొసంగుట :—

ఇంద్రాదులు కుమారుని పరంపరాభివృద్ధినిఁ గాంచి యమితానందంబు నందుచు బృహస్పతిపురస్కృతులై మహేశ్వరుని సందర్శించి "దేవదేవా! మమ్ములఁ దారకుం డను రాక్షసుండు బలువెతలం బెట్టుచున్నవాఁడు. వానివలన మేము పడుచున్న బాధలఁ జెప్ప వలంతులము కాము. వాఁడు బ్రహ్మవరలబ్ధగర్వంబునఁ గ్రిందుమీఁదు గానక యెటఁజూచినఁ దానయై చెలరేఁగుచున్నవాఁడు. అలనాఁడు బ్రహ్మ మామొఱలాలించి మీకుమారుండు వానిని సంహరించు నని యానతిచ్చె. అటనుండియు మేము పలువెతలం గుందుచు భవత్పుత్రోదయంబు నాకాంక్షించుచు నెటెటో ప్రాణంబుల నిలిపికొనినారము. నేఁటికి మానోము లన్నియును ఫలించినవి. మాకష్టంబులును గట్టెక్కినవి. దేవర యనుగ్రహించి భవత్కుమారుని సేనానిగఁ జేసితిరేని మామనోరథం బీడేరు" ననుచు దీనాతిదీనులై మొఱలిడిరి. వారిమొఱ లాలించి యాశ్రితావనతత్పరుఁ డగుగిరిజాజాని నిజకుమారుం బిలిచి "కుమారా! యింద్రాదిదేవతలు సేనాని లేమిం జేసి మిగులఁ జింతిల్లుచు

న్నారు. మఱియు నదికారణంబుగఁ దారకుండను క్రూరరాక్ష సుఁడు వీరిని బలువిధంబులఁ జెఱచుచున్నాఁడు. కాన నీవు దేవసేనానివై యుపాయంబునఁ దారకుని వధించి యింద్రాదులకు శుభం బొనఁగూర్పు మనుచు నాతనికి దేవసేనాధిప త్యము నొసంగి యింద్రాదులకు స్వనివాసంబులకుఁబో సెల వొసంగె. ఉమయు దేవసేనాధిపత్యమును వహించినకుమా రుం గాంచి "నాయనా! నీ వచిరకాలంబుననే తారకజేతవు గమ్ము" అనుచు దీవించి యింద్రాదులకు సెల వొసంగె.

—: తారకవధ :—

ఇంద్రాదులు భవానీభర్గులసెలవుల నంది కుమారుం దోడ్కొనిపోయి తారకుండు గావించినదుండగములను వాని పరిభావంబును వానియునికియుఁ దాము గావించినయత్నం బులును మొదలుగా సర్వంబును విన్నవించి యాతనిసాయం బునఁ దారకవధకు వలయుయత్నములం గావించుచుండిరి. కుమారుఁడు దేవవరులవలనఁ దారకునివృత్తమును బూర్తిగ నాలించి తత్సంహారణోపాయంబు నాలోచించుచు దేవలోకం బునఁ గలవింతలను జూచుచుండె. తన కప్పటికి కాలము స మీపించుఁడు తారకుఁడు నిజసహచరులవలనఁ గుమారజన నాదికమును దెలిసికొని వారలం గాంచి "సహచరులారా! నిన్న మొన్న పుట్టి మాయ యన నేమో యెఱుంగక యుండి నకుమారుఁడా ననుఁ జంపువాఁడు? నే నజేయత్వమును బ్రబ హ్మను మెప్పించి పొందినవాఁడను గదా? ఆబ్రహ్మయైనను

నను( దేఱిచూడఁగలఁడా? అట్టితఱిఁ గుమారుఁడా నాతోఁబోరి జయమొందుట? నే నింతదనుక దేవతలను దయతో క్షమించి యూరకుంటినిగాని నావధకై యత్నించువారి నిప్పు డిఁకఁ బ్రాణాలతో నుండనీను. చూడుఁడు నాప్రభావము" నని నాఁడు బ్రహ్మచెప్పినమాటలను గర్వవశంబున మఱచి దేవలోకంబునఁ గలయుద్యానవనంబుల నూఁచముట్టుగఁ బెఱికివైచి వియన్నదియందుఁ బాఱవైచుచుఁ గల్పవృక్షమును జెండాడసమకట్టి యటకుఁ బోవఁ గుమారుండును గల్పవృక్షదిదృక్ష నటకుఁ బోయి వికృతాకారుండై యుండిన క్రూరదానవునిం గని "యోరీ! నీ వెవఁడవు? ఎందుల కిట నుంటివి? నే నీశ్వరకుమారుఁడను. నీ వీవఱకు దేవతలఁ జెండాడఁదలఁచి సకలవిధంబులఁ జెలరేఁగు తారకుఁడవా యేమి? అట్లైన నిను వధింప నే నిటకే తెంచితి. తారకుఁడవే యైన నిప్పుడ నిన్ను ద్వంద్వయుద్ధమునఁ గృతాంతక్షయంబునకుఁ బంపువాఁడ" నని చెప్పి సమరసన్నద్ధుం డై యుండె. తారకుండు తన్ను నిర్భయముగఁ జంపెదనని చెప్పి యెదుట నిలిచియుండిన కుమారుం గని "యోరీ! డింభకా! నీవా నన్ను వధించుట? నీతండ్రి శివుఁడుకూడ ననుఁ దేఱిచూడ నోడియుండెనే? అట్టితఱి బాల్యచాపలంబున నోరికివచ్చినటుల నేమో పేలుచున్నాఁడవు. నీకుఁ బ్రాణాలపై నాస గలదేని పొమ్ము. లేదేని సమరమ్మునకు రమ్ము" అని గర్వంబుకతనఁ జెప్పఁ గుమారుండు రోషారుణితనేత్రుఁడై

వానిం గదిసి ద్వంద్వయుద్ధముఁ జేయం గడంగె. తారకుఁ
కూడఁ గుమారుఁ గదిసి యుద్ధమును జేయుచు దేవవరులు
గులంది చూచుచుండఁ గుమారుని నేలం బడనైచె. తో
గుమారుండు లేచి సూక్ష్మరూపుఁడై పైకెగిరి తారకునిమ
కమును బట్టి నేలం బడనైచి ముష్టిప్రహారంబుల శిరంబున
బగులఁగొట్టి నఖంబుల వక్షంబును జీల్చి యాతనిరుధిరం
ను గరకమలంబులఁ బైకిఁ జాఱఁజల్లుచుండె. ఘోరదానవు
డు కుమారునిబారి కాఁగలేక పెద్దపెట్టున రొద సేయుచ
ప్రాణంబుల వీడె. దేవవరులు కుమారుని సమీపించి యాత
వేనోళ్ళం బొగడి యాతనిశిరంబునఁ బుష్పవర్షముఁ గురి
చిరి. వెంటనే కుమారుఁడు వీరాధివీరుఁడై తలిదండ్రులయు దే
తలయు మెప్పును బడసి షాణ్మాతురుఁడు గాంగేయుఁడు కా
కేయుఁడు మున్నగునామంబులఁ దనరుచు సకలజనవందనీయు
డై యుండె. అదిమొదలు దేవతలందఱును సర్వసుఖంబుల న
దుచు హావిర్భాగంబుల నిరంతరాయంబుగ ననుభవించుచ
గుమారునిప్రాపున డెందంబులఁ జేయునైచుకొని నిద్రించుచ
డిరి. దేవలతోపాటు రతియు ననంగుం డగునిజనాథునితో
సుఖంబుగ నుండె. వీరుం డగుకుమారుం డొడ్డొని భవా
భర్గులు కైలాసంబున కేగి తపంబును గావించుకొనుచుండి

పరిసమాప్తము.